శీలా ప్రచురణలు:

సంపాదకుడు.
యం. జగన్నాధరెడ్డి

వెల: రు. 1-50

ప్రథమ ముద్రణ
1960
కాపీలు: 500

శీలా ప్రెస్, విజయవాడ-2.

# చంద్రనాథ్

ఆనాడు చంద్రనాథ్ తండ్రి చనిపోయి పండ్రెండవ రోజు. మణిశంకరము ఖోపాధ్యాయ్, చంద్రనాథ్ పినతండ్రి, తన అన్నగారి శ్రాద్ధాకర్మను తానుదగ్గరనేఉండి సక్రమముగా జరిగేటట్లుగా చూచినేకాని వారింట్లోనీరుత్రాగలేదు- అన్నము ముట్టలేదు. తానేకాక తనవారినికూడ అన్నముకేసి చూడనియ్యలేదు. దీనికంతకును కారణము క్రితమురోజున తనకు చంద్రనాథ్‌కి కలిగిన చిన్నవిషయములోనిమనస్పర్ధయే. బ్రాహ్మణులు భోజనములుచేసి లేచినారు. చంద్రనాథ్‌కి పినతండ్రి అన్నముతినకపోవుట హితవు లేకపోయినది. అతడు రెండుచేతులు జోడించి 'బాబా! మీరునాకు తండ్రి తర్వాత తండ్రియంతటివారు. నేనుమీకు పుత్రతుల్యుడను. నాలో ఏమైనను పొరపాట్లు వచ్చినచో మీరు సరిదిద్ది క్షమించండి, అన్నాడు.

మణిశంకరుడు మానసిక కల్మషముతో నే'నాయనా! నీవు కలకత్తాలోఉండి ఎం. ఏ. పాసైన చదువరివి. నేను ప్రాతకాలపు వాడను. నాకు నీకు మనస్సులు కలియవు. విన్నావుగా పెద్దలమాట - ' వేరునరికి కొమ్మలకు నీరుపోయుమని అన్నాడు.

అసాటింతకు ప్రకృతము జరిగిన దానికిని సంబంధము లేకపోయినను మణిశంకరుని భావమును గ్రహించి చంద్రనాథ్ ఇకముందు తాను తనపినతండ్రితో ఎట్టిసంబంధ బాంధవ్యములును ఉంచుకొన కూడదని మనస్సులో నిశ్చయించు

కొనెను. తండ్రి బ్రతికియున్న రోజులలో కూడ అన్నదమ్ము లలో పెద్దఇదిగా కలుపుగోలు తనాలులేవు. ఏదోకార్యాల పట్ల మాత్రము భోజనాలున్నవి అంతే. దీనితో అదికూడ ఆగిపోయినది.

చంద్రనాథ్ తండ్రి నాలుగు రాళ్లు ప్రోగుచేసిరో పోయినాడు. అయితేయేమి? ఇంట్లో ఆదరాభిమానాలు కల వారు మాత్రము కరువైనారు. అతనికి మేనమామ అత్త మాత్రమే ఉన్నారు. వారికైనను సంతానము పూజ్యమే.

ఆయిల్లు చూచుసరికి చంద్రనాథ్ కేమియు తోచలేదు. గుమాస్తాతో 'నే కొన్నాళ్లు దేశాలు తిరుగదలచినాను. తిరిగి రాక దగ్గరలో ఉన్నట్లులేదు. అందుచేత ఇంటి వ్యవహారా లన్నీ మీరే జాగ్రత్తగా చూడవలె' నన్నాడు.

బ్రజకిశోరుడు, చంద్రనాథ్ మేనమామ 'నాయనా! ఇప్పుడప్పుడే నీవు దేశాంతరానికి వెళ్ళకు'మని నిషేధించి నాడు. అయినను, అతనిమాటలను లెక్కచేయకుండ గుమా స్తాకే గృహనిర్వహణ భారమప్పచెప్పివేసి, కొద్ది అజమా యిషీ మాత్రమే మేనమామకు అప్పచెప్పి, నౌకరునైనను కూడతీసికొనక తానొక్కడే బయలుదేరి వెళ్ళినాడు.

బ్రజకిశోరుని భార్య, హరకాళి. పేరుకుతగ్గదే. వాళ్ళ తల్లిదండ్రులు 'మహాంకాళి' అని పెట్టబోయి 'హరకాళి' అన్నారేమో? మగని పిల్చినది. 'ఎంతపనిచేశారూ? అన్నది.

అతనికి తానుచేసిన తప్పేమిటో తెలియక 'ఏమిటే?' అన్నాడు.

'మేనల్లుడు విదేశానికి వెళ్తున్నాడుకదా. ఆ స్త్రీపాస్త్రుల మాటేదో కాస్త వ్రాయించుకొని పంపకపోయారూ! కాలము ఎట్లా ఉంటుందో ఎవరు చెప్పగలరు? కీడెంచి మేలెంచ మన్నారుకదా పెద్దలు.'

వ్రజకిశోరుని కామాటలు ములుకులులాగ పోకినవి. చెవులుమూసికొని 'రామరామ' అట్లా అనకు! మనము ఆమాట భావించరాదు.' అన్నాడు.

హరికాళికి అరకాలిమంట నెత్తికెక్కినది. మీా తెలివి ఇట్లా తెల్లవారినది కనుకనే నేచెప్పవలసి వచ్చింది. లేకపోతే నేచెప్పడం ఎందుకు?' అన్నది.

ఆమె అతని కెట్లోనూరిపోసినది. చెప్పగా చెప్పగా తల కెక్కకపోవునా! అతనికి తానుచేసినది పొరపాటు అనిపించి నది అప్పు డొక్కరవ్వ పశ్చాత్తాపపడినాడు.

చంద్రనాథ్ బయలుదేరినేకాని అతనికి ఫలానాచోటికి వెళ్ళవలెనని లేదు. తోచినట్లోక యేడాదిపాటు తిరిగినాడు. గయకువచ్చి గయాశ్రాద్ధముపెట్టి, అక్కడే సాంవత్సరీకాలు జరిపినాడు. అప్పటికిని అతనిమనస్సులో ఇంటికి వెళ్ళవలెనని తోచలేదు. కాశీలోకూడ కొన్నాళ్ళు గడపవలెనని సంకల్పము పుట్టినది. లేడికిలేచినదే ప్రయాణముకదా! కాశీ చేరినాడు.

కాశీలో హరిదయాల్ ఘోషాఅనే పండా ఉన్నాడు. అతనియింటికి చంద్రనాథ్ తండ్రితో పాటునొకసార్లు వచ్చి నాడు. అతడుకూడ చంద్రనాథ్ని బాగా ఎరుగును. ఒక నాడు మధ్యాహ్నమువేళ ఒక్కచేతిసంచితో పండాయింటికి

చేరుకున్నాడు. చంద్రనాథ్ అట్లా హఠాత్తుగా వచ్చుట అతనికెంతో ఆశ్చర్యాన్ని కలిగించినది. అతనిని గారవించి, పై అంతస్తులోని గదిలో తోచినన్నాళ్లుండుమని చెప్పినాడు.

ఆగదికొకకిటికీ ఉన్నది. ఆకిటికీలోనుంచి చూచినచో వంటయిల్లు కొంతగా కన్పించును చంద్రనాథ్ బుద్ధి పూర్వకముగా అటుకేసే చూచుచుండువాడు. వంటకత్తెను చూచుట అతనికెంతో హితవుగా ఉండేది.

ఆవంటలక్క విధవయే. కాని యౌవనము ఇంకను పోలేదు. ఏదో విచారముతో ఆమెముఖము వాడిపోయి యుండేది. తలవంచుకొని తనపనితాను చేసికొనేది. ఆమెకు పదేళ్ళపిల్ల ఉన్నది. ఆపిల్ల తల్లికి అదీ – ఇదీ అందించుటలో సాయము చేయుచుండేది. అట్లా సాయపడుటయే అతని నాకర్షించినది.

కొన్నాళ్ళు క్రొత్తబాధించును. ఆమె క్రొత్తలో అతనికెదుట పడేదే కాదు. మరి కొన్నాళ్ళకు సగము సగముగా కన్పడేది. ఆమెకంటె అతడు చాల చిన్నవాడు. అది కాక కొన్నాళ్ళగుసరికేదో చెప్పరాని చను వేర్పడును. దాని తో ఎబ్బరికముతగ్గును. కొన్నాళ్ళకామె చంద్రనాథ్‌కి దగ్గర గాకూర్చుని వడ్డించినవన్నీ హితవుగాతినేటట్లు బతిమాలి– బామాలితినునట్లు చేసెడిది.

చంద్రనాథునికి తల్లి చిన్నప్పుడే గతించినది. ఆమె మాటలుకాదు సరికదా రూపము ఛాయగానైనను అతనికి గుర్తులేదు తండ్రే తల్లియై పెంచినాడు. ఎంత గారముగా చూచినను మగవానిచేతి పెంపకమే. ఇప్పుడు తండ్రికూడ

చనిపోవుటతో అతనికి కల్గిన బెంగ ఈవంటలక్క తీర్చినది. తీర్చుటయే కాదు, అతనిని వశము చేసికొన్నది.

ఒకనాడు చంద్రనాథ్ 'అయ్యా! నా అన్నవారెవరును లేరుకదా! మరి యీ తల్లీ-పిల్లలెవరు?' అని హరిదయాళ్‌ని అడిగినాడు.

'ఈమె బ్రాహ్మణస్త్రీ.'

'మీకేమైనను దూరబంధువా?'

'ఊహుఁ'

'అట్లయిన మరి?'

'అదొక పెద్ద విషాదగాథ. సంక్షేపముగా చెప్పెద; విను. మూడేళ్ళనాడు ఈమె భర్త-పిల్లలతో తీర్థయాత్రకై వచ్చినది. ఇక్కడ భర్త చనిపోయినాడు. తనయూరిలో కావలసినవారెవరును లేరట. గతిలేక బిచ్చమెత్తుకొనుచుండగా నేనాదరించితిని, ఇదీకథ.'

చంద్రనాథ్ బుర్ర కొంచెము తిరిగినది. 'ఈమె యిల్లెక్కడో మీరెరుగుదురా?'

'సరిగా తెలియదు. అయినను నవద్వీప సమీపములోని యేదో చిన్నపల్లెటూరు అనిమాత్రము విన్నాను.

## ౨

రెండురోజులు జరిగినవి. ఆనాడు భోజనము చేయుచుండగా దగ్గరగా కూర్చున్న వంటలక్కని 'మీరెవరూ?' అని అడిగినాడు.

ఆమె ముఖము వెలవెలబోయినది. అప్లెందు కడిగనో గ్రహించినది. వినీవిననట్లుగా కటాలున లేచి 'వెళ్ళిపాలు పట్టుకొస్తా' అని లోనికేగినది.

పాలు తెచ్చుట కింకను చాల వ్యవధియున్నది. జవా బాలోచించు కొనుటకే ఆమె లోనికేగినది. అక్కడసరయు. ఆమె కూతురు పాలుచల్లారపెట్టుచున్నది. తల్లి ముఖవాలక మామెకు తెలియలేదు. తల్లిమాత్రము పిల్లకేసి ఒక్కసారి చూచి పాలగిన్నె తీసికొన్నది. తనలో 'ఓ భగవాన్! నన్ను క్షమించు' అనుకొని ఒక్కనిట్టూర్పు పుచ్చినది. పాలుతీసి అక్కడపెట్టి తానుకూడ కూర్చున్నది. చంద్రనాథ్ తానడి గిన ప్రశ్నకు జవాబు రానందుకు అట్టే వదలక మరల ప్రశ్నిం చినాడు.

ఆమె మెల్లగా జవాబు చెప్పనారంభించినది. అతడు ప్రశ్న పరంపరలడుగగా ఆమె అన్నిటికిని జవాబిచ్చినది. 'మరిమీరు మీయింటికి వెళ్ళలేదేమి? ఎవరునులేరా?'

'లేకపోలేదు కాని పట్టుమని పట్టెడన్నము పెట్టేవారు. లేరుబాబూ!'

చంద్రనాథ్ తలవంచుకొని ఒక్కక్షణ మాలోచించి 'మరి ఈపిల్ల పెళ్ళెట్లుచేయగల్గుదురు?'

అనుటతో 'అంతయు అపుట్టించిన పరమేశ్వరునికే యెరుక' అన్నదినిట్టూర్పుతో. చంద్రనాథ్ భోజనముపూర్తి అయినది.అతడు తలెత్తి 'నేనింతవరకు మీ అమ్మాయిని సరి గాచూడలేదుకాని చూచినంతలో పరమశాంత స్వభావురాలు లాగ కనిపించునుకదూ;

ఆమెనవ్వుచు 'నేను కన్నతల్లినికదా, కాకిపిల్ల కాకికి ముద్దన్నట్లుగా నాపిల్లనాకళ్ళకి అందముగానే కన్పించును. ఎంతఇది అయినను మాసరయు అందమైనది కాకపోదు.' అన్నది ఆట్లాపైకన్నదేకాని లోలోన ఎవరిలోను ఇంతటి అందము కన్పడనేలేదు' అనుకొన్నది. అందులో కొంత సత్యము లేకపోలేదు.

నాల్గురోజులు గడచినవి. ఒకనాడు ప్రొద్దునవేళ సరయు కూరలు తరుగుచున్నది. ఇంట్లో ఇంకెవరును లేరు. తల్లి గంగాస్నానానికి వెళ్ళినది. పండా యాత్రికులకోసమై వెళ్ళినాడు. అప్పుడు చంద్రనాథ్ ఆమెకేసి రెప్పార్పక పరిశీలనగా చూచినాడు. ఆమెలోఏదో ముగ్ధమాధుర్యమున్నదనిపించినది. అంతేకాదు;ఆఆనందమును రెవకిని ఉండదేమో అనిపించినది

చంద్రనాథ్ మెల్లగా దగ్గరగావెళ్ళి 'సరయూ' అని పలకరించినాడు.

ఆమె కదే మొదటిసారి అట్టికంఠధ్వని వినుటకు. ఉలికి పడినది. సిగ్గు దొంతరలుగావచ్చినది. 'ఏమండీ' అని ఎట్లో జవాబిచ్చినది.

'నీవు వంటచేయుగలవా?

'ఆఁ'అన్నదితలవంచుకొ నేతనకంత ప్రజ్ఞకలదన్నట్లుగా.

'ఆఁ ఏ గే పదార్థాలు తయారుచేయుగలవు?'

ఆమెను పల్కరించుట కదోమెత్తు అనుకున్నదేమో మాటమీదమాటగా సంభాషణ పెరుగునని కాబోలు జవాబియ్య నేలేదు.

చంద్రనాథ్ కామె మనోభావము వ్యక్తమైనది. కొంచెము తిరుగనేసి ఆరంభించినాడు. 'నీవు,మీఅమ్మ యిద్ద రేనా ఇక్కడ పనిచేసేది?' అన్నాడు.

'అవును'

'నీకు నెలకేపాటి జీతమిత్తురు?'

'జీతము జీతముగా మాఅమ్మకొక్కర్తెకే. నాకు అన్నమే జీతము. అన్నది.

'ఆహా! నీవన్నానికే పనిచేసేది.' అన్నమాట.

సరయూకేమి చెప్పవలెనో తోచలేదు. చంద్రనాథ్‌కి వాక్యపరంపర తోచినది. మరి నేనే అన్నము పెట్టగలిగినచో నాకుకూడ అన్నమువండిపెట్టుదువా? అన్నాడు

'అమ్మని అడిగి...' అన్నది అర్ధాంగీకారసూచనగా.

'అయ్యో! దానికేమి? అడిగే చెప్పు.' అన్నాడు.

చంద్రనాథ్‌కి ఆలస్యము సహింపరానిదై పోయినది! హరిదయాలు నడిగి కొన్నివిషయములు తెలిసికొని తనగుమాస్తాకి ఉత్తరము వ్రాసినాడు.

'నేను కాశీలో ఉన్నాను. ఇక్కడే పెండ్లిచేసికొనుటకు నిశ్చయించుకొన్నాను. ఈ విషయము మామామతో చెప్పవలెను. దానికి కావలసిన నగలు- నాణెములతో వెంటనే నీవిక్కడికి రావలెను.'

డబ్బుకలవారు తలచుకొన్నచో ఏదిజరుగదు? వివాహము సలక్షణముగా జరిగిపోయినది. సరయూకి అత్తవారింటికి మగనితో వెళ్ళవలసి వచ్చినది. ప్రయాణమైనప్లే, అప్పుడు సరయు కంటతడిపెట్టుకొని 'మరిమాఅమ్మగతేమిటి? అన్నది.

'ఆమెకోసము అంతవిచార మెందుకు? మనతోనే వచ్చును.' అన్నాడు చంద్రనాథ్. ఆమాటలు వంటలక్క చెవిని పడినవి. ఒకనాడు రహస్యముగా సరయుతో 'అమ్మా! నీవు అత్తవారింటికేగినాక ఎప్పుడైన నన్ను తలచుకొన్నను సరే కాని, నోటితో పైకి నాపేరుమాత్ర ముచ్చరింప వద్దు సుమా! నాజీవితములో నేను కాశీవదలను. నీ వెప్పుడైన నిక్కడికి వచ్చినచో, కలిసికొనవచ్చు' అన్నది.

ఆమాటలు విని సరయు ఏడ్వసాగినది.

తల్లి పైటచెరగుతో కన్నులొత్తుచు, ఏడువరాదని ధైర్యముచెప్పి, అంతలో గంభీరముగా 'అమ్మాయి! అన్నియు తెలిసినదానవు నీవుకూడ ఏడ్చుచున్నావా?అన్నది.

కూతురి కెంతో దుఃఖముపొంగి వచ్చినది. తల్లి యొడిలో తలదాచుకొని 'అమ్మా! అని తలవంచివేసినది.

'అమ్మ బాగుండవలెన్నచో అమ్మని మరచిపోవు టయే కర్తవ్యము 'తల్లీ!' అన్నది.

ఒకవేళ చంద్రనాథ్ బతిమాలినను రానని చెప్పివేసి నది నిక్కచ్చిగా.

చంద్రనాథ్ ఆమె అనుకొన్నట్లుగానే బతిమాలి-బామాలి లాభములేక ఆఖరికి 'సరే, మీరిక్కడనే ఉండండి. కాని యీవృత్తిమాని హాయిగా ఉండరాదూ?' అన్నాడు.

ఆమె అదికూడ చేయుట కొప్పుకొనక 'పండాగారు నన్ను కన్నబిడ్డలాగ ఆదరించినారు. ఆయన నన్నుకష్టదశలో చేరదీసినారు. వారిపైనాకు పితృభక్తి ఉన్నది. ఇప్పుడునేనా రీతిని వదలలేను.' అన్నది.

అటువంటి పరిస్థితిలోకూడ ఆమెకేదో ఆత్మగౌరవము, కృతజ్ఞత ఉన్నవని తలచి చంద్రనాథ్ మరీమరీ ఆమెను బల వంతముచేయక భార్యను తోడ్కొని యింటికి వచ్చినాడు.

సరయు భర్తగృహముచూచినది. ఎంతోవిశాలముగా ఉన్నది. ఎన్నోవస్తువులు, అలంకారాలతో ఊహాతీతమైన అంద మామెకు కన్పించినది. ఆమె యెప్పుడు నట్టియింటిని చూడనేలేదేమో! 'అబ్బ! వీరికినామీద ఎంతదయ!' అను కొని ఆనందించినది మనస్సులో.

చంద్రనాథ్ అనూత్న వధువునాడిలోనికి తీసికొనుచు 'ఈయిల్లు - వాకిలి చూచితివికదా! బాగున్నదా?' అని ఆద రముతో అడిగినాడు.

ఆమె పైటచాటునకు ముఖం పెట్టుకొన్నది. చంద్ర నాథ్‌కి ఆమె భావము తెలిసినది. కాని ఆమెమాటలు వినవ లెననుకోరిక తీరలేదు. రెండుచేతులతోను ఆమెతలనెత్తి 'ఏమిటి' చెప్పు? బాగున్నదా! నీకునచ్చినదా' అనిరెట్టించి నాడు. ఆమెకాఆనందములో ముఖముకందినది. ఎట్లోమాట రప్పించుకొని 'ఇదంతయునాకేనా' అని అడిగినది. అతడు నవ్వుకొని, ఆమె మాటలోనే 'ఆ అంతయు నీదే' వారి కెంతో ఆనందముకల్గినది.

# 3

కొన్నాళ్లు - కొన్నేళ్ళు గడచినవి. సరయు పెద్దదై నది. భర్తకుసేవచేయుట ఆమెకు తెలిసినది. భర్తమనసులో ఏమనుకొనునో దానిని వెంటనే గ్రహించినట్లుగా చేసెడి.

ఆమె ఒకదాసీ. అట్టిదాసీ ప్రపంచమున దుర్లభము. కాని యొకటి: స్త్రీని వివాహమాడునది కేవలము దాస్యమునకు కాదు. పరస్పర మనోభావభేదములు లేకుండ ఐక్యమై ఏదో చెప్పరాని ఆనందమనుభవించుటకే. భార్య దాసీపనేచేయు చున్నచో అదికూడ సహ్యముకాదు. సరయు నడవడిక ఎంత మధురము, ఎంత నిస్స్వార్థమున్నూ అయినను దాంపత్య సౌఖ్యాన్ని ఇయ్యలేక పోయినందున సరిపూర్ణానంద దాయకము కాలేకపోయినది. అందుచే వారిద్దరిమధ్య చెప్పరాని భేదముండిపోయినది.

ఒకనాడు హఠాత్తుగా చంద్రనాథ్ సరయుని ఒత్తుకొని 'నీవు జంకుచున్నట్లు కన్పించెదవెందుకు? నాలో ఏమైనను లోపమున్నదా?' అని అడిగినాడు.

ఆమె మనస్సులో ఎన్నోభావాలు రేకెత్తినవి 'మీరే ఎరుగుదురు దీనిజవాబు' అనుకొన్నదొకసారి. మరల 'మీరే దేవతాస్వరూపులు, మహానుభావులు. మరినేనో? పతితను, మీరు ఆశ్రయాన్ని ఇచ్చినారు-నేనాశ్రయించిన దానను. మీరుదాతలైన - నేను బిచ్చకత్తెను' అనుకొన్నది.

సరయు హృదయము కృతజ్ఞతతో నిండుకున్నది. అది తగ్గినకాని ప్రేమ తలెత్తదు. లోలోన అంతఃప్రవాహమై నిశ్శబ్దముగా ఉన్నదేకాని పొంగి పొరలుటలేదు. లోపల నణగియున్న సంగతిని చంద్రనాథ్ ఊహింపలేకుండెను. పాపాత్ముడు భగవంతుని నూరుతేర్చగా చంద్రనాథ్ ఆప్రేమను కనుగొనలేకపోయినాడు నీరపుకాంతిలో ఆమెనేత్ర పద్మములలో సిరుప్రేమ్ముటచూచి ఉండబట్టలేకఆమెనుదగ్గరగా

తీసికొన్నాడు. ఆమె భర్తహృదయమొని కాచుకున్నది. అతను 'పోనీలే, ఇప్పుడాసంగతేమియు తలపెట్టనులే.' అని ముఖము పైకెత్తినాడు. ఆమెకన్నులు మూసికొనియే సుఖాన్ని అనుభవించినది.

చంద్రనాథ్ 'ఏదీఒక్కసారినాకేసి చూడు'మన్నాడు.

సరయుకెంతో భయము వేసినది. కన్నులను గట్టిగా మూసికొన్నది. ఆమె లోలోపలఉన్న భయమామెను కన్నులు తెరవనియ్యలేదు.

చంద్రనాథ్ కదేమియు అర్థముకాలేదు. నెమ్మదిగానిట్టూర్చినాడు. 'సరయు! నీకు భయమెక్కువ. నానంకేనాడని లేక పోవుచున్నావు. చూచినచో ఆనందింపగల్గుదువు. పోనీ, ఒకపని చేయుము. నేను నిద్రపోవునప్పుడైనను పరకాయించిచూడుము. అప్పుడు నీకు భయముతగ్గును. నాగుండెలపైన తల పెట్టుకున్నావుకదా! నాలోపలనున్న భావము నీకర్థమగుట లేదా? అయ్యో! ఇప్పటికిని నామనస్సును నీవు తెలిసికొన లేకపోవుట నాకెంతో విచారముగానున్నది.' అన్నాడు.

సరయు మాట్లాడలేక పోయినది. ఆమె తనలోనే భర్త పాదములకు నమస్కరించినది. 'నేను మీపాదదాసీని. దీనినిట్లే ఉండనిండు' అనుకొన్నది.

౪

చంద్రనాథ్ మేనత్తయైన హరకాళికి పాపము! సుఖములేదు. ఆపాదుదైవమామె నట్లుచేసినాడు. కొంతమందికి ప్రపంచమే చొరరాని అరణ్యములాగ కనిపించును. అందు

లోనుంచియే వారుతమకొక సుఖమార్గమున్నదాఅని వెతకు
కొనవలెను. అయినను కొందరికిదొరుకును; కొందరికిదొరకదు.

ఇప్పుడు హారకాళికి చంద్రనాథుని తండ్రి పోవుటతో కొంచెము శాంతికల్గినను కాని తలవని తలంపుగా చంద్రనాథ్‌కి పెళ్ళియగుట, అందులోను భార్యా భర్తలకు ఎరమరికలులేని ప్రేమ కల్గుట ఆమె మనస్సులో అశాంతిని రేగగొట్టినవి. ఆమెకొకమేనకోడ లున్నది. ఆమెకిప్పటికిని పదేళ్ల వయస్సే. ఆమెనితనికిచ్చి పెళ్ళిచేసినచో బాగుండునను కొన్నది, ఇప్పుడావిషయానికిక స్వస్తియే ఇందుమూలాన ఆమె కేమాత్రమును శాంతిలేకపోయినది.

ఇప్పటికికూడ హారకాళే ఇంటిపెత్తనము వెలిగించుచున్నది. ఆమెభర్తగారే యజమానుడు. అన్నియు యథాపూర్వముగానే నడచుచున్నవి. సరయు ఆమెకేసి చూచుచునే కాని అభిమానముకాని, అసంతృప్తికాని ఆమె చూపులలో లేదు. ఆమెకే నిజముగా ఈయింటిలో అధికారమున్నప్పటికిని ఆ అధికారమును ఇతరుల అనుగ్రహముపై ఆధారపడియున్నదే. ప్రజకిశోరు డామెను చూడగానే మనసుకరగిపోయి 'మాకోడలు, మాకోడలు' అని యేమేమో మెచ్చుకోబోవును. కాని అంతలో హారకాళి భద్రకాళియై కళ్లెర్రజేసి 'ఆఁ చాలుచాలు.అక్కడికాపవచ్చు. తెలియనివాళ్ళు తెలియనట్లుండుటయే మంచిది. మాతల్లితండ్రులునన్ను మీచేతుల్లోపెట్టకుండ, కాళ్లుచేతులుకట్టి గంగలోపార వేసినను బాగుండేదేమో? అనేది. అంతే పాపము! ఆమానవుడు నిలువున కూలి అక్కడినుండి మరొకచోటికి పోవువాడు

హారకాళికి ముప్పదియేళ్లుండును. సరయుకి పదేళ్ళయి నను నిండలేదు. ఇప్పుడు వారిద్దరిమధ్యన తెలియని యేదో అంతర్యుద్ధము జరుగుచున్నది. దానిలో జయముమాత్రము సరయుదే. ఆమె విజయమును పొందినను ఆవిజయ సూచ నగా అధికారాన్ని చలాయించుటలేదు. కాని మరేమో హారికాళిమాత్రము ఓడిపోయే ఉన్నది.

అదొక సృష్టిచిత్రము. సరయు కన్నియు తెలియును. ఆమె మూగది కాదు. పిచ్చిదీ కాదు. హారకాళి అన్న మాటల కన్నిటికిని తలవంచుకునే ఒక్కొక్కమాటగా జవా బిచ్చును. దానితో హారకాళి నోరు లేవదు. దీనితో తాను గెల్చిన దనుటకును వీలులేదు. ఓడిన దనుటకును వీలులేదు. సరయు లొంగను లేదు. మించను లేదు. ఆమె కదోనోరు కలదికాని తంపులమారికాని, పొరుగన్న కిట్టని ఒంటికాయ లొంటికొమ్మ కాని అయినచో హారకాళి ఈపాటికే తనదారి తాను చూచుకొనేది. ఆమె కోరనక్కరలేకుండగనే సరయు ఆమెపై దయచూపుచున్నది అన్నియు తెలిసికొండ తానే మియు కానట్లుగా ప్రవర్తించుచున్నది. ఇది మరింత బాధా కరమై హారకాళికి ఈర్ష్యాగ్నిని ప్రజ్వలింపజేసినది.

చంద్రనాథునివద్ద సరయు కొక ప్రత్యేకస్థానమున్నది. చుట్టువార గిరిగీసినట్లుగా దానిలోపలి కెవరును రాజాలరు. అదిసురక్షిత ప్రదేశము—చంద్రనాథుని మనస్సు. దానికి బయట హారకాళివంటి వారలు వందమందేమి చేసికొన్నను ఆమె కేమియు చీమకుట్టదు. ఆ పసిపిల్ల ఏమంత్రజాల బలము

తోనో తన గోళ్ళ-పళ్ళవిషమంత హరించి యుండవచ్చునను కొన్నది హరకాళి

ఇట్లారేళ్లు గడచినవి. పదునొకండవయేట భర్తృగృహానికి వచ్చిన సరయుకిప్పుడు పదునేడవయేడు.

౨

సృష్టి చిత్రమైనది. స్త్రీ పురుషులు సమముగానే పెరిగినను వారిలో జ్ఞానవికాసములో చాలభేదమున్నది. పురుషులు వయోభేదమునుబట్టి గౌరవా గౌరవముల నెరపుదురు. కాని స్త్రీలలో ఈ వయోభేదమంతగా పాటింపదగినదిగా నుండదు. పది-పదారేళ్లువచ్చేవరకు స్త్రీ కుటుంబములో పిల్లవలె పెరిగి కావలసినవి కొన్ని నేర్చును. అప్పుడొక్క-సారిగా గృహయజమానురాలై పోవును. ఆమెకును - పదిమందిని కన్న ముదుసలవ్వకును భేదముండదు. అత్త - కోడలు మున్నగు భేదమువలన కొద్దిపాటి తారతమ్యమగపడినను లేనట్లెలెక్క-.

చంద్రనాథుని యూరిలో హరిబాలయను ముసలవ్వయున్నది. ఆమెకు సరయూతో కల్గిన సంబంధము చూచినచో మనకిదే తోచును. ఒకనాడు సరయు కిటికీ తెరచుకొని నిలువబడినది. ఆమె బయటికి చూచుచున్నది. కాని అక్క-డేమియు లేదు. శూన్యమేఅది, ఇంతలో హరిబాల పళ్ళెములో పిండివంటలు పెట్టుకొని హఠాత్తుగా లోనికివచ్చి నిలబడినది. పళ్లెములోనుండి ఒకపూలదండను సరయు మెడలో వేసి 'ఏది, నన్నొకక్క-సారి చెలీ! అను' కొన్నది.

సరయు కదేమియు తెలియలేదేమో? జవాబుగా ఒక్క చిరునవ్వు నవ్వినది. 'మంచిదే' అన్నది.

అబ్బే! మంచిదనుట కాదు. నీవు నన్ను 'చెలీ! అన వలసినదే'

ఆదరణ కానియ్యండి, వాత్సల్యము కానీయండి, ఇట్టి దెప్పుడును సరయు జీవితములో జరిగియుండలేదు. అందు చేతనే ఈనిర్వ్యాజ ప్రేమకు వణికినది. వయసా తన మామ్మ యీడుగల ఆమెను కౌగిలించుకొని సరియీడుదాన్నిలాగ 'చెలీ' అనవలెనన్న ఆమెకు సిగ్గువేసినది. అయినను హారి బాల మాత్ర మామెను వదలలేదు. అట్లు సిగ్గుపడుటలో ప్రొందనముకాని, కృత్రిమత్వముకాని లేదని హారిబాలకు తోచినది. కావుననే ఆమె సరయు ఆలస్యము చేయుచుండగా సహించలేక 'పోనీఅమ్మా! నాదండనాకిచ్చెయ్యి. నే నింకొకరి దగ్గరికి వెళ్లి నాపని నే చూచుకొందును.' అన్నది.

సరయు మనస్సు ఎంతగా తబ్బిబ్బైనను ప్రతిభ మాత్రము తగ్గలేదు. ఒక్క చిరునవ్వునవ్వి మృదుమధుర ముగా 'ఏమీ! మరొక చెలికత్తెను చూడబోయెదరా?' అని చిరునవ్వు నవ్వినది.

హారిబాల కా జవాబుతో కొంత స్తిమితము వచ్చినది. 'ఆహాఁ. బలేబాగుగా మాట్లాడుదువే. నల్గురును నీ కసలు మాట్లాడుటయే చేతకాదందురే' అన్నది సరయు నవ్వినది. 'ఆఁ' అన్నట్లుగా.

'సరే యికవిను, ఈ యూరిలో నీకొక్క స్నేహితు రాలును లేదుకదా? మీది గొప్పయిల్లనీ, మీ భర్తగారి

మేనత్త నోరుమంచిది కాదనీ జడిసి, ఎవ్వారునుకూడ ఇక్కడికిరారు. కాని నేమాత్రము వచ్చుచు - పోవుచుందునులే. నేనెంతగా ముసలిదాననే అయినను, పగలస్తమానము హరి నామస్మరణతోనే కాలక్షేపము చేయలేను. ఊరకే మీయింటికి రాక-పోకలు చేయుట బాగుండదని ఇట్లా స్నేహము కల్పించుకొన్నాను.' అన్నది హరిబాల,

'అట్లే తప్పక వచ్చుచుండండి' అన్నది సరయు.

'అదిగో ఇంకను వచ్చుచుండండి' ఏమిటి? అదికాదు. ప్రేమ - స్నేహము స్పష్టము కావలెనన్నచో 'ఏది, నీవు రోజురోజు వస్తూండు' అను. ఏం అంటావా? లేదా? అని హరిబాల ఆకొంచెము చనువుతోనే కయ్యమన్నది.

'అవ్వగారూ! క్షమించండి. నన్ను నరికినను నేనట్లా అనలేనండీ' అన్నది నవ్వుచునే సరయు.

హరిబాలకును నవ్వువచ్చినది. పోనీపో 'నీ' వనలేక పోయినచో పోనీగాని. రోజూవస్తూండు చెలీ!'అన్నైనను అను, అన్నది. సరయు సిగ్గుతో తలవంచుకొనే చాలచొరవతో అన్నట్లుగా 'చెలీ! రోజూ రావమ్మా!' అన్నది. అదే సంతోషాన్ని కల్గించినది హరిబాలకు.

అక్కడినుండి ప్రతిరోజు హరిబాల సరయు వద్దకు వచ్చుచు పోవుచుండెడిది. ఇద్దరిమధ్యన క్రమముగా స్నేహభావము పెంపొందినది. క్రమేణ హరిబాల తనతో ఈడు జోడు కాదన్నసంగతే మరచినది సరయు. కోడిఋాడుదాన్ని లాగ కౌగిలించుకొనేది. అదే స్నేహితోనికన్న మొదటిచనవు. అధికారమును.

హరకాళికి వీరిస్నేహము విషయమై ఎట్లున్నదో చెప్ప లేము. కాని చంద్రనాథ్‌కి మాత్రము అతియిష్టముగానే యున్నది. అట్లాఉండుటయే మంచిదని తన భార్యతో తరచు అనే వాడుకూడ. హఠాత్తుగా జరిగిన, ఎక్కడను జరుగని ఆస్నేహముచూచి అతడే ఆశ్చర్యపడేవాడు-ఆనందించేవాడు.

అతడు తన భార్యనెంతగానో ప్రేమించేవాడు. ఆమె అతని పట్ల ఎంత దాసిలాగ ప్రవర్తించినను ఆమె విషయమై అతనికి మంచి ప్రేమయే యున్నది. అతని సరిపెట్టుకునే ప్రకృతి. 'అందరికిని ఒకేరకపు భార్య దొరకదు ఒకరిభార్య స్నేహితురాలైన, మరొకరిభార్య గయ్యాళిగంపకావచ్చు. ఇంకొరిభార్య దాసీకావచ్చు. అయినను నాభార్య పతివ్రత, సుశీల, స్నేహపూరితమైన హృదయముకల సతీమణి' అని సంతృప్తిపడేవాడు. మధ్యలో ఆమె గతజీవితాన్ని, స్మరించి 'పాపము ఎన్నికష్టాలనుభవించినది! బాల్యమట్లా గడిచినదన్న యౌవనముకూడ ఇట్లు జరుగుచున్నదే. ఇక్కడికి కాకమరె క్కడికైనను వెళ్ళియున్నచో ఇంకెన్నికష్టాలు పడవలసివచ్చి యుండెడిదో! ఈరూపము, ఈసౌందర్యము, ఈయౌవనము అన్నీ ఈమెకు బాధలకే ఉపయోగించి యుండెవి. అట్లే జరిగినచో...

అని మెన్నోపాడు ఊహలు ఊహించేవాడు. అంత లోకరుణ కలిగేది. హృదయము ద్రవించేది. అప్పుడు సరయు ముఖముపైకెత్తి 'సరూ! నేనే నిన్ను ప్రేమించక, తీసికొని రాకపోయినచో నీవెట్లుండేదానవు? నీవెక్కడవుండేదానవు!' అని పిచ్చిప్రశ్న వేసేవాడు.

సరయు జవాబే యిచ్చేదికాదు. ఒక్కసారిగా ఆమె హృదయము భయభ్రాంతమైపోయేది. భర్తహృదయాన్ని హత్తుకునేది. చంద్రనాధ్ ప్రేమతో ఆమెనొసటిపై చెయ్యి వేసి ఆమెకు ధైర్యము చెప్పుటకై ప్రయత్నించేవాడు. 'నీ కెందు కింతభయము వెర్రిదానా!' అనుకునేవాడు లోపలనే.

సరయు మరింతగా హత్తుకొనేది. ఇటువంటి మాటలతో నిజముగా భయపడేది. చంద్రనాధ్ అనాలని అనక పోయినను, ఆమెను భయపెట్టేటట్లు అనుటకిష్టములేక, నేనూరకే అన్నానుకాని అదేమి జరుగదులే. కాని నీవంటి అందకత్తెవు అంత దరిద్రులయింట్లోయెట్లా, యెందుకు పుట్టవలసి వచ్చెనా! అని నేననుకునేది. అయినను నీవేనాకు ప్రతిజన్మ లోను నాపతివ్రతయైన భార్యవు. ఇందుకు సందేహమేమియు నులేదు. ఈప్రపంచకములో నీవెక్కడనున్నను నేనాకర్షింప బడకతప్పదు. సరూ! నీ ఆకర్షణమూలాన నేనే కాశీవచ్చినది సుమా!' అనేవాడు. అటువంటప్పుడు చంద్రనాధ్ హృదయములో రేగే భావపరంపరకి సరయు యొక్క ప్రేమ, సేవ, భక్తి అన్నియు కలిసినను సమముకాజాలవు. ఏవిచారగ్రస్తురాలి మీదనో, అనుగ్రహించి దయచూపినప్పుడెట్టి దయ, అభిమానము కల్గునో చంద్రనాధ్‌కి సరయుని చేపట్టినప్పుడటువంటి అభిమానము, తృప్తి అనుగ్రహమనే మమతో కల్గినది. అదినాడు పొమ్మన్నను పోయేదికాదు. అదిహృదయములో ఏమూలనోఅణగియేయున్నది. ఆభావమెప్పుడుతలెత్తునో అప్పుడెల్ల అతడు సరయుని గుండెలకు హత్తుకొని 'నీవు కైనాళ్ళనుంచి చూచుచుండికూడ గ్రహించలేక పోవుచుం

టివే, అదేనాకాశ్చర్యముగా నున్నది. నేనునిన్ను తొలిసారి చూడగానే నాదానవని గుర్తించితిని. ఇప్పుడేకాదు; జన్మ జన్మాన, యుగయుగాన, నీవునాదానవే. ఇన్నాళ్ళెందువల్ల విడిపోయినామో కాని మరల కలియుటకే ఇట్లా అయినాము, అనేవాడు. అదోరకము మాధుర్యము-ప్రేమ

సరయు మెల్లగా అతని యొడిలో తలదాచుకొని 'నేను మాత్రము మిమ్మలిని గుర్తింపలేదని యెవరన్నారు' అనేది మెల్లగా.

చంద్రనాథ్ ఎక్కువ ఉత్సాహముతో సిగ్గుపడుచున్న సరయు ముఖమును పైకెత్తి తన ముఖమునకు ఎదురుగా పెట్టుకొని 'గుర్తించితివా? మరి యింకే భయమెందుకు? నీవున్నట్లు నేనేమియు వ్యతిరేకముగా ప్రవర్తించనే, నన్ను నాకంటె కూడ మిక్కిలిగా ప్రేమింతువని' అనును.

సరయు మరల భర్తయొడిలో తలదాచుకొనును. చంద్రనాథ్ 'మరిచెప్పు భయమెందుకు?' అని నొక్కి-నొక్కి-అడుగును.

సరయు నోటమాట పెకలదు. ఆమె భర్తవద్దను అబద్ధమెట్లు చెప్పగలదు? తనకున్న భయమునెట్లు చెప్పగలదు? ఆమె హృదయాంతరాంతరాలలో ఎంతో భయమున్నది. అదేమిటో ఆమెకు తప్ప మరెవ్వరికిని తెలియదు.

సరయు కొక స్నేహితురాలు దొరుకుటవలన చంద్రనాథ్ కెంతో ఆనందముగానే ఉన్నది. ఆ ఆనందానికి కారణము ఆమెకు కష్టసుఖాలు చెప్పుకొనుటకై ఒక స్నేహితురాలు దొరుకుటయే.

ఒకనాడు సరయు మధ్యాహ్నపువేళ అంతయు హరిబాల రాకకై యెదురుచూచుచు కూర్చున్నది. మబ్బులు దట్టనగా క్రమ్మినవి. చిటపట చినుకులు పడుచున్నవి. హరిబాల రాలేదు. చినుకులుపడుచున్న మూలాన రాలేదని అనుకొన్నది సరయు. ప్రొద్దు క్రుంకవచ్చినది. ఒంటరిగానే పగలెల్ల గడపినది సరయు. హరకాళికూడ ఇంట్లో లేదు.

ఇంకేమియు తోచక చొరవగా సరయు భర్త చదువుకొనే గదిలోనికి వెళ్లినది. ఎంతో పెద్దపనియున్నప్పుడు కాని యెవరు నాగదిలోని కేగరు. ఎవరో కాదు సరయుకూడపోదు. ఇంతవరకును పోలేదు. చంద్రనాథ్ పుస్తకము మీదినుంచి దృష్టిమరలించి, తలెత్తి 'ఈవేళ చెలి వచ్చినట్లులేదే? అన్నాడు.

'అవును, రాలేదు.'

'అందుకే నేను జ్ఞాపకము వచ్చియుంటాను!'

సరయు నవ్వినది. ఆనవ్వులో 'ఎప్పుడును రావాలనే ఉండును కాని వచ్చుటకు ధైర్యము చాలదు.' అనే భావము వ్యక్తమగుచున్నది. 'వర్షము మూలాననే ఆమె వచ్చియుండ దనుకొందును.' అన్నది సరయు.

'ఆహా! కాదుకాదు. ఇవ్వేళ మా బాబాయిగారి చిన్నమ్మాయిని పెళ్లికూతురును పూలుముడుచుటకువచ్చిరిలే. తొందరలోనే ఆమె పెళ్లికూడ కాబోవును. ఆహడావిడిలో ఉండి అవ్వ వచ్చియుండదు, అన్నాడు.

'కావచ్చు మీరు చెప్పినదే అయియుండును.'

కొంచెముసేపాగి చంద్రనాథ్ మరల అందుకున్నాడు 'ఏమిటో! బొత్తుగా మనము పరాయివారలముగా నుండుట విచారకరముగానే యున్నది. ఏది, అత్తయ్య ఎక్కడ నున్నది?

'ఆవిడకూడ అక్కడికే వెళ్లియుండును?'

చంద్రనాథ్ మాట్లాడకుండ ఏదో ఆలోచించుచునే యున్నాడు. సరయు అతనికి దగ్గరగాకూర్చుని 'ఏమిటి ఆలోచించుచున్నట్లున్నారు? చెప్పుదురా?' అని అడిగినది.

చంద్రనాథ్ నవ్వబోవుచు సరయూ చేతిని తనచేతి లోనికి తీసికొని మెల్లగా చెప్ప నారంభించినాడు. 'లేదు సరయూ! ఏమిలేదు. నిర్మలకు పెళ్లి కాబోవుచుండగా నాకు కబురైనను పెట్టక మా అత్తయ్యను మాత్రమే పిల్చుకొని వెళ్లినారు. దీనినిబట్టి మనమిద్దరమే పైవాళ్ళ మయినా మన్నమాట.'

చంద్రనాథుని స్వరము విచారముతో కలిసియున్నది. అదికనిపెట్టినది సరయు. 'నాకు మీపాద సన్నిహిత స్థానమిచ్చి నందుకు మీరు మరీ పరాయివారైనారు. లేకపోయినచో ఈపాటి దైక్యము కుదిరియుండేదేమో?'

చంద్రనాథ్ నవ్వి 'లేదు. కలవవలసినంత అవసర మేమియులేదు. నీకు బదులుగా బాబాయితో సంబంధము కుదిరినందున నాకేదో సుఖముండునని తోచదు. మనకిప్పుడే బాగున్నది. నేను పెళ్ళిచేసికొనేముందు బాబాయినే సంప్ర దించినచో నేను నీప్రేమ మారగొన కలిగేవాడనుకాను. ఏదోఒకచిక్కు అడ్డుతగిలియుండేది ఆయన ఏకులము విషయ

మో, వంశము గొడవో లేవదీసి అవునని, కాదని అభ్యంతర పెట్టేవారు. మొత్తముమీద మనవివాహానికేదో అడ్డంకు వచ్చియుండేది.

సరయుకి లోలోపల వణుకుపుట్టినది. అప్పటికే ప్రొద్దు గ్రుంకి చీకటి ఆగది నాక్రమించినది. అందుచే ఆచీకట్లో చంద్రనాథ్ ఆమె ముఖమును స్పష్టముగా చూడలేక పోయినాడు. అయినను చంద్రనాథ్ చేతిలోనున్న ఆమె చేయివణకినది. ఆకంపమే ఆమెమనస్థితిని చంద్రనాథ్‌కి చెప్పినది.

అదిగమనించి చంద్రనాథు 'నేను మా బాబాయిని సలహా అడగక పోవుట మంచిదో చెడ్డదో ఇప్పటికైనను గుర్తించితివా?' అన్నాడు.

కొంచెముసేపు మౌనముగానుండి సరయు 'నేనేమెరుగుదును? మీకుమాత్రము నేనుకానిచో నావంటి దాసీలు వందలో వేలో దక్కియుండేనారు.

చంద్రనాథు సరయు హస్తపల్లవాన్ని మెల్లగా ఒత్తుచు 'నాకదేమియు తెలియదు, నాకున్న దొకేయొక్కదాసి. ఆమె విషయమే నేనాలోచించగలను. మరివందల - వేల దాసీల విషయము నీవే ఆలోచించుకో' అన్నాడు.

హరిబాల మరునాడు వచ్చినది. ఆమె ముఖలక్షణాలు అదోరకముగా ఉన్నవి. మామూలుగా ప్రేమపూర్వకముగా కౌగిలించుకొని చెలీ! చెలీ! అని సరయును విసిగించలేదు; ఆడుకొనుటకై పేక తెమ్మనను లేదు. మెల్లగా బుజ్జగించనులేదు. ఉదాసీనముగా అట్లే మౌనముగా కూర్చుండిపోయినది.

సరయు 'నిన్న రాలేదేమి చెలీ!' అన్నది.

'అవును చెలీ! నిన్న చాలపనియుండిపోయినది. వారింటిలో నిర్మల పెళ్లికదూ!'

'ఆc, అవును. విన్నా అంతయు కుదిరినదా?'

సారిబాల సరయు ప్రశ్నలను వినుటయేలేదు. ఆమె ఏదో ఆలోచనలో మునిగియున్నది. ఇక ఉండబట్టలేక 'చెలీ! ఒకటడుగుతాను నిజము చెప్పెదవా?'

'ఏమిటది?'

'నిజముగా చెప్పెదనన్నమీదనే అడిగెదను. లేనిచో అడిగి నోరువెళ్లిచేసికొనుట యేల?'

సరయు కేదో అనుమానము తట్టినట్లున్నది; చిన్న తనము వేసినది. అయినను 'ఏమి! నిజమెందుకు చెప్పను?' అన్నది

'నీవునన్ను నమ్మెదవా? చెప్పు?'

'ఏమి! ఎందుకు నమ్మను?'

అట్లయినచో ఇకచెప్పవచ్చు. చంద్రనాథ్ నిన్ను ఎట్లు ప్రేమించుచుండును?'

'నన్ను చాలదయగా చూచెదరు' అన్నది చాల సిగ్గుతో.

'కాదు దయసంగతి కాదుగా నేనడిగెడిది. నిన్ను బాగా ఎక్కువగా ప్రేమించుచున్నాడా? లేదా? అని.

సరయు పెద్దనవ్వునవ్వి, 'మహా మంచి ప్రశ్న వేసితివే! వారు ఎంతగా ప్రేమించుచున్నారో నాకెట్లు తెలియును?' అన్నది.

'నిజముగా నీకు తెలియనే తెలియదా?'

'అచ్చే' అని తలనూపినది.

ఆవిషయము సరయుకి తెలియకపోవుట మాత్రము యథార్థమే. హరిబాల ఏదో ఆలోచనలో పడినది. ఆమె తలాడించి 'భర్త తననెంతగా ప్రేమించుచున్నన్నదీ భార్యకు తెలియకుండ ఉండునా? ఇందుచేతనే నీకుభయముగాఉన్నది.'

ఆప్రశ్నలో హరిబాల ముఖలక్షణాలలో ఏదో సందేహము కలిసి కన్పించుచున్నది. సరయుకూడ అదిగ్రహించినది. ఆమెను శంకించినది. 'ఏమి? నాకుభయమెందుకు?' అని అడిగినది.

'అదిమరొకరోజున వింటువుగానిలే.' అన్నది.

కొంచెము సేపైన తర్వాత సరయు గడ్డము చివరను పట్టుకొని మృదువుగా 'ఏమిచెలీ! ఇంతఅందము, ఇంతగుణము, ఇంత తెలివి కలిగికూడ ఇన్నాళ్ళనుండి నీవు నీళ్లు నములుచుంటివే' అన్నది హరిబాల.

సరయు పక్కున నవ్వినది.

౬

అప్పటికింకను అసలు విషయమెవరికిని తెలియలేదు. హరిదయాల్ ఘోషాలు అనుమానించుచునే యున్నాడు. పైకి పెద్దమనిషిలాగే ఉన్నను చినిగిపోయిన గుడ్డలతో ఒక డెవరోవచ్చి ఆవంటకత్తెయైన బ్రాహ్మణవిధవను కలిసిమాట్లాడిపోవుచున్నాడు. ఈవిషయమసలు హరిదయాల్ కి తెలియదని సులోచన, ఆ వంటకత్తె యూహ. కాని ఆయన కంతయును తెలిసినది.

ఆరోజు మధ్యాహ్నము హరిదయాలు, ఆయన పిన తండ్రి కైలాస్ కలిసి ఇంటిసావడిలో చదరంగమాడుచున్నారు. ఇంతలో వంటయింటి దొడ్డినుండి యేదోగొడవ వినబడినది. ఒకరు దీనముగా బతిమాలుచుండగా రెండవ వ్యక్తి పౌరుషముగా చీదరించుకొనుచు భయపెట్టుచున్నాడు. ఒకవ్యక్తి స్త్రీ-రెండవ్యక్తి పురుషుడను అని గుర్తు తెలిసినది.

హరిదయాల్ 'బాబాయ్! దొడ్లో ఏదో గొడవ జరుగుచున్నదే' అన్నాడు. కైలాస్ 'చూడు, ఇదిగో ఇదిచూడు' అని హెచ్చరించినాడు.

మరికొంతసేపు వరకు ఏమియు వినపడలేదు. కాని మరల గొడవవినపడసాగినది. అదివిని హరిదయాల్ 'నేను వెళ్ళిచూచి వచ్చెదను.' అని లేచి నిలబడినాడు.

కైలాస్ ఆయన కట్టుబట్టనుచ్చిళ్ళు పట్టుకొని 'ఇదిగో చూడు నీఆటకట్టుచున్నది. ఓడిపోయెదవు' అని లాగినాడు. హరిదయాల్ తప్పనిసరియై కూర్చున్నాడే కాని మనస్సు దొడ్డివైపే యున్నది. గొడవతగ్గలేదు. ఇకతప్పక, లేచి వెళ్ళి చూచినాడు. సులోచన రెండుచేతులతోను ఆపురుషుని పాదాలు పట్టుకొని యున్నది. అతను 'నేచెప్పినట్లు ఒప్పుకో, లేదా నేను అన్నంత చేసి తీరుదును.' అని గద్దించుచున్నాడు బిగ్గరగా.

సులోచన ఏడ్చుచు 'నన్ను క్షమించు. నీవు నన్నొక సారి భ్రష్టను చేసితివి. ఇప్పుడు దానినికూడ సర్వనాశనము చేయకు' అనుచున్నది,

'నీకూతురు అంతకలవానిని పెళ్ళాడెనదికదా! నీవు రెండువేల రూపాయిలు ఇయ్యలేవా? నాచేతికి డబ్బురాగానే వెళ్ళిపోదును.' అనుచున్నాడు నూత్నవ్యక్తి.

'నీవు త్రాగుబోతువు దుష్టుడవు రెండువేలైనగాని చేతిలో యెన్నాళ్ళుండును! అవి కాగానే మరల తెమ్మందువు. ఏదైన నగుగాక, నేమాత్రము డబ్బియ్యను.' అన్నది.

'నేను త్రాగుట మానెదను. ఏదోయొక వ్యాపారము చేసికొని జీవింతును. ఇంకెప్పుడును నీవద్దకురాను.' అన్నాడు.

సులోచన దానికి బదులు చెప్పలేదు. తలను నేలకువేసి కొట్టుకొని, చేతులు జోడించి' నామీదదయయుంచు. నేను సరయును డబ్బడగలేను' అన్నది.

హరిదయాల్ వచ్చి పక్కనే నిలబడినాడని వారిద్దరును గమనించనేలేదు. అందుచేతనే గట్టిగా ఘర్షణపడుచున్నారు. ఒక్కసారిగా హరిదయాలునిచూచి ఇద్దరునుకంగారుపడినారు. హరిదయాల్ ఆక్రొత్తవాని వద్దకేగి 'నీ వెవరి అనుమతి మీద నాయింటిలోనికి ప్రవేశించితివిరా?' అని గద్దించినాడు.

మొదట ఆక్రొత్తవ్యక్తి తటపటాయించెను. కాని తరువాత తాను చేసినది అక్రమమని గుర్తించుకొని మెల్లగా జారుకొనుచున్నాడు. అప్పుడు హరిదయాల్ అతనిచేతిని గట్టిగా పట్టుకొని 'చెప్పు! ఎవరి అనుమతిపై వచ్చితివో' అని గద్దించినాడు.

ఇంక పారిపోవుటకు తగిన అవకాశము లేదని తెలిసికొని, ధైర్యము తెచ్చుకొని 'సులోచన వద్దకు వచ్చితిని' అన్నాడు.

వాని నోటినుండి మద్యమువాసన గుప్పున కొట్టుచున్నది. ఒళ్లుచూడగానే వాని హైన్యము, కులభ్రష్టత్వము వ్యక్తమగుచున్నది. హరిదయాల్‌కి అసహ్యము వేసినది. పెదవి విరచి 'ఎవరినడిగివచ్చితివని?' అని క్రూరముగా మరల ప్రశ్నించినాడు.

'అనుమతి యెందుకో!' అని యెదురుప్రశ్న వేసినాడు నూతనవ్యక్తి.

ఇప్పుడతని ముఖలక్షణము మారినది. ఈ అడిగెడి వానినికూడ గద్దించెడి అవకాశము తనకున్నదని తోచిన దతనికి. ఆ ఉద్దేశముతోనే అతడు వేసిన ఎదురు ప్రశ్నకు హరిదయాల్ ఉగ్రుడైనాడు. 'దుర్మార్గుడా! బాగుబోతా! నిన్నిప్పుడే జైలుకి పంపించగలను తెలిసుకో! జాగ్రత్త' అన్నాడు.

వాడు మొగముచిట్లించుకొని 'ఆఁ ఆఁ ఎందుకు తెలియదూ?' అన్నాడు.

హరిదయాల్ వానిమీదికి చేతిసత్తబోయి' ఎరుగుదువా? అట్లయిన, పద. ఇప్పుడే పోలీసుల కప్పగింతును' అన్నాడు.

అతడొక్క నవ్వుతో పోలీసుల కప్పజెప్పుటకు తన కభ్యంతరములేదన్నట్లు సూచించి' ఇప్పుడేతీసికొని వెళ్లెదరా! అని అడిగినాడు నిర్భయముగా.

హరిదయాల్ 'అవును, ఇప్పుడే' అని వానినొక్క త్రోపుత్రోసినాడు.

ఆ త్రోపునకు తట్టుకొని అతడు 'పండాగారూ! మీ ప్రతాపమంతయు ఒక్కసారిగా చూపకండి. పోలీసులకే అప్పగింతునో, మరి స్టేషనులోనో ఆలోచించి చేయండి. నిన్ను కాశీనుంచి తరుమగొట్టించగలనని నీవెరుగుదువా?' అన్నాడు గట్టిగా.

హరిదయాల్ పిచ్చివాడులాగ అరచుచు 'ఓరి పదరా! నాకు కాశీలోనే నలువది యేళ్లు గడచిపోయినవి. ఇవ్వేళ నన్ను వెళ్ళగొట్టగలవాడీడు?' అన్నాడు.

ఆ క్రొత్తవాడు తనకు గూండాలభయము చెప్పుచున్నాడని పండాగారి యూహ. కొందరు గూండాలపేరు చెప్పుసరికే భయపడుదురు. పండాకిట్టి భయము లేదు ఆదృష్టిలోనే 'ఓరి! నీ గూండాగిరీతో బెదరింతువట్రా!' అన్నాడు కోపముగా.

'అయ్యా! గూండాగిరీ కాదు; నన్ను పోలీసుస్టేషనుకే తీసికొని నడవండి. అక్కడే చెప్పెదనుగా అంతయును.

'ఏమిట్రా నీవు చెప్పేది?.

'నీవు జాతిభ్రష్టుడవని, చెడిపోయితివని టాంటాం చేసి కాశీలో నీకు ఉప్పుపుట్టకుండ చేసెదను. అదీ చెప్పేది,'

'నేను... జాతిభ్రష్టుడనా? చెడిపోతినా?'

'అయ్యా! పండాగారూ! అంత కోపము తెచ్చుకోకండి. మీరొక్కరే జాతిభ్రష్టులై యున్నారుకో లేదు. ఇన్నాళ్ళనుంచి మీ యింటికి వచ్చి నాలుగు మెతుకులు కొరికిన యాత్రికులను. శిష్యులను—అందరినీ జాతిభ్రష్టులను చేసినారు. నేను వారందరికిని తెలియునట్లు చెప్పదలచినాను.'

దానితో పండాకు కొంచెము భయముకలిగినది. అంతగాజాతిభ్రష్టుడు అగుటకు కారణమేమో తెలిసికోకముందే అతనికి భయమువేసినది. ఆవచ్చినవాడు తనయింట్లోనున్న వంటలక్కతో మాట్లాడుటయే ఆ అనుమానాన్ని కల్గించినది. అతని కంఠస్వరము సన్నగిల్లినది. 'ఏమిటీ? నేను నిజముగా యాత్రికులను భ్రష్టముచేసితినా?' అన్నాడు.

'తప్పక ఆవిషయమును నేను ఋజువుచేసి కొందును. ఆభారమునాపై వదలండి.'

హరిదయాల్ మెత్తపడినాడు. 'ఓయి నాయనా! అసలువిషయమేమిటి? కొంచెము తెలియునట్లు చెప్పుబాబూ!'

'నీవొక్కడవే వినదలచితివా? పదిమంది ముందరవిందువా? ఎందుకైనను మంచిది చుట్టుప్రక్కల పదిమందినిపిలు' అని నవ్వినాడు.

పండా వానిచేతినిపట్టుకొని బతిమాలుచు 'కోపపడకు బాబూ! నేను నీమీదకోపడితిననుకో. అదేమీలెక్కచేయకు. రా. లోపలికివెళ్ళి మాట్లాడుకొందము' అని లోనికితీసికొని వెళ్ళినాడు.

ఇద్దరును సుఖముగా కూర్చున్నారు. ఆఁ, అసలుకథేమిటి? చెప్పు?'

'ఆఁ, పెద్దగాచెప్పుట కేమున్నది? సులోచన, మీవంటకత్తెలేదూ! ఈమె మీకెక్కడ దొరకినట్లు?'

'ఇక్కడే అనాథ అని ఆశ్రయ మిచ్చినాను.'

'ఆఁ, డబ్బున్నపిల్లని చెరడీసినా రనుట లేదు కాని దీని జాతి-నీతి యేమైనను తెలిసికొన్నావా? అది.'

ఆ ప్రశ్నతో హరిదయాల్ కొంచెము మాడిపోయినది. తాను చేసిన లోప మదొక్కటే. ఏదో అనాథకదా అని దయ చూపినాడేకాని జాతి జన్మ అడగలేదు. అది తన లోపమే. అయినను సంభాళించుకొని 'తెలియదేమి? బ్రాహ్మణది విధవ. ఆచార వ్యవహారములు కది. ఈమె చేతివంట తిన్న మూలాన వచ్చే ఆమహాదోష మేమిటి? అన్నాడు.

'మీరు చెప్పినట్లు ఈమె బ్రాహ్మణ విధవే. కాని కులంవిడిచిపెట్టి లేచివచ్చిన దానిని మీరు ఆచారవంతులా లనగలరా? దానిచేతివంట తినవచ్చునా?'

హరిదయాల్ నాలుక కొరికికొని 'శివశివ' అటువంటి దానిచేతివంట తినుట తప్పు కాదా?'

'జరిగినదికూడ అదే, పదేను, పదారేళ్ళ క్రిందట ఇల్లు వదలి మూడేళ్ళపిల్లతో లేచివచ్చిన కులభ్రష్టకా శ్రయమిచ్చి మీరెంతకాలనో పోషించినారు సరా!'

'దీనికి ప్రమాణమేమిటి?'

'అదా ఉన్నది. ఈమె ఎవరితో లేచివచ్చినదో ఆ ఈమె' కాముకుడు-రాఖాల్ భట్టాచార్ి, ఇంకను బ్రతికేయున్నాడు.

హరిదయాల్ కొంచెముసే పావ్యక్తికేసి తేరిపార చూచి, ఇతనే ఆభట్టాచారి కావచ్చుననుకున్నాడు. 'నీవు బ్రాహ్మణుడవేనా?' అని ప్రశ్నించాడు.

అతడు మాసిపోయి, చినిగిపోయిన దుప్పటిలోనుంచి అంతకన్న తెగమాసిన్న జందెమును తీసిచూపుచు 'ఆఁ కాదు నేనుపల్లెవాడను' అన్నాడు నవ్వుచు.

పండా అదిచూచికూడ కొంచెము వెనుకకుజరిగినాడు. 'నీవు పైకివాలకమునుబట్టి మాదిగవానివలె కన్పడుచున్నావులే. పోనీ, నమస్కారము' అన్నాడు.

అతనికామాట కేమియు కోపమురాలేదు. నమస్సులు మీరట్లనుకొనుటలో తప్పేమియునులేదు. నన్ను చండాలుడన్నను, తురకఅన్నను, క్రైస్తవుడన్నను బాధలేదు. నాకు జాతిభేదాల పాటింపులేదు. నేనొక పరమహంస సన్యాసిని,

'నీవు పాషండుడవు'

'మీరిప్పుడు నన్నువక్కాణగలేరు. ఇదివరకే ఎందరో ఎన్నోరకాలుగా సంబోధించినారు. అందులో ఇదొకటి. నామొదటి అవస్థయేమిటో, ఇప్పుడేమిటిగామారితినో అంతయు నేనెరుగను. కాని, నేనే ఆరాఖాల్ అన్నది మాత్రము ఖాయము.'

హరిదయాల్‌కి కోపముతో ముఖమెర్రపడినది. అతి కష్టముమీద తనకోపమును అణచుకొనుచు, 'సరే, కాని యిప్పుడేమి చేయవలెనని నీయూహ చెప్పు. సులోచనను తీసికొని వెళ్లెదవా?'

'లేదండీ' నేనట్లుచేసినచో మీకు భోజనానికి బాధ కల్గవచ్చు. నేనంత దయమాలినవాడనుకాను.'

చాల ఓర్పుతో పండా ఆపరిహాసవాక్యాలు కూడ విన్నాడు. 'మరి, నీకోరిక? ఇక్కడికెందుకువచ్చితివి?'

'డబ్బుకావలెను డబ్బులేమిచే చాల కష్టములో పడియున్నాను. అందుకే నే వచ్చినది. రెండువేల రూపాయ

లిచ్చినచో కిక్కురుమనకుండ పోయెదను. అది చెప్పుటకే వచ్చినది.'

'బాగున్నది. కాని నీకంతడబ్బిచ్చేవారెవరు?'

'అవసరమున్నవారే. మీరు ఇయ్యగలరు. సులోచన అల్లుడున్నాడుగా, ఇయ్యగలడు.'

హారిదయాలుకి అతనియొత్తు వినుసరికే భయమువేసినది. వాడు మహాధూర్తుడని, వ్యవహారమెట్లా నడిపిన నెట్లు పరిణమించునో తెలిసినవాడనియుకూడ గ్రహించినాడు. కాని పైకి 'ఏమయ్యోయి! నేనునిట్టదరిద్రుడను. నీవు చెప్పిన మొత్తమొక్కసారిగా కళ్ళారచూచిన పాపానకూడ పోయినవాడగాను. ఇక సులోచన అల్లుడు — అతడు ధనవంతుడే అయినను, అతనిని భయపెట్టి నీవు కానియైనను పెవగలేవు. అతడు నీకన్న రెండాకు లెక్కువ చదివినవాడే.

రాఖాల్ దయాల్ ముఖముకేసి చూచి, నవ్వుచు, 'ఆవిషయము నేనుచూచుకొందునులే. యెత్నేకృతేయదిన సిద్ధతి. ...'

అనుచుండగనే మధ్యలో అందుకొని దయాల్ 'ఆగు ఆగవయ్యా బాబూ! దేవభాషనుకూడ అపభ్రంశముచేయకు.'

'మీఆజ్ఞ, ఇంకనేనిక్కడ ఎక్కువసేపుండలేను. కాని ఏది — వారిఅడ్రసు చెప్పండి?' అన్నాడు దర్జాగా.

'అదికూడ సులోచననే అడుగకపోతివా?'

'ఆమెచెప్పదు. కాని మీరుచెప్పుదురని'

'నేనుకూడ చెప్పకపోయినచో...'

'ఆ మీరు తప్పక చెప్పెదరు, మీరు చెప్పనిచో నేనేమి చేయదలచితినో ముందే చెప్పితినికదా!' అన్నాడు ధైర్యముగా.

హరిదయాల్ ముఖము వాడిపోయినది. 'నేను నిన్నేమియును బాధించలేముకదా!' అన్నాడు.

'తమరేమియు చేయలేదు కన్యనే ఈయోగ్యునకని చేయుమని కోరుచున్నాను. మీరు వారి ఊరుపేరు చెప్పినచో ఒక్కసారి వెళ్లి ఆఅల్లుని చూచి రాగలను చాలరోజులైనది కన్య పిల్లనుకూడ చూచివత్తును.'

హరిదయాలుకి లోపల భయముగానే ఉన్నను పైకి గాంభీరముగా 'నేను నీకేవిషయములో సహాయముచేయలేను. నీకిష్టమైనట్లు చేసికో. ఏదోజరిగిపోయినది. కావలెనన్న జరిగినదానికి ప్రాయశ్చిత్తము చేసికొందునుకాని నీకుమాత్రము సహాయము చేయను. నాకింక భయమేటికి?'

'ఆఁ అదా? భయములేనిచో ఈపూటే యీవిషయము పండాలందరికిని చెప్పెదను. తర్వాత నీతిరోజాడలు తీసి అల్లునివద్దకువెళ్లి అక్కడకూడ ఈవిషయము వెల్లడిచేసి తీరుదును. పండాగారూ! మీకు భయములేదుగా. మరి వెళ్లి వస్తాను. నమస్కారము '

అతడు లేవబోవుచుండగా పండా అతనిచేతినిపట్టుకొని కూర్చుండబెట్టి మెల్లగా 'నీవంత తేలికగా వదలేవాడవు కావని నేనెరుగుదును. సరే కోపపడకు నామాటవిను. దీన్నింతటితో తెంపివేయి 'ఇక ముందుకు సాగనియ్యకు.' అయిదారు

రోజులలోరా. అప్పుడు నాచేతనైనంతవరకు చేయుదును.' అన్నాడు.

'వచ్చుటకు నాఅభ్యంతరము లేదుకాని ఆనాడుకూడ ఇట్లేచేసినచో ఊరుకోనుసుమా!'

పండా అతనికేసి తీవ్రముగా చూచుచు, ఏమయ్యా! నీవు నిజముగా బ్రాహ్మణుడవేనా?

'అవునండీ'

నిట్టూర్పువిడిచి 'ఆశ్చర్యముగానే ఉన్నదే. అట్లయిన నీవు ఒక్కవారమాగిరా. ఈలోపల ఎవరితోను చెప్పకు.'

'సరేలెండి' అని రెండడుగులువేసి రాఖాల్ మరల ముందుకువచ్చి రెండురూపాయలైన నియ్యండి. నాపర్సు ఎక్కడో పోయినది.' అని నవ్వసాగినాడు.

హరిదయాల్ అతనిముఖముకేసిచూడ లేకపోయినాడు. కిక్కురుమనకుండ రెండురూపాయలు తీసి అతనిచేతిలో పెట్టినాడు. వాటిని రొంటిని దోపుకొనుచు వెళ్ళిపోయినాడు రాఖాలు.

అతడువెళ్ళినను, అట్లే నిలుచుండిపోయినాడు పండా. కొన్నివేల తేళ్లు ఒక్కసారిగా కుట్టినట్లుగా శరీరము భగ్గుమని పోయినది దయాలునకు.

## ౭

సులోచన ఎక్కడికివెళ్ళినదో అని మూడురోజుల నుంచి పండా నిద్రాహారాలు, తననిత్య వృత్తియైన యాత్రి కాన్వేషణమాని కాశీ అంతను గాలించి వదలినాడు. కాని అతని కెక్కడను సులోచనజాడయే పొడగట్టలేదు. ఇక చేయు

కల్గినది లేక ఇంటికి తిరిగివచ్చినాడు. నోరు – నెత్తిమోదుకొనుచు 'హాపరమేశ్వరా! విశ్వేశ్వరా! ఏమి టీదురవస్థ'? ఒక దిక్కులేనిదానిని చేరదీసినందుకు తుదకునాకు 'పుణ్యానకుపోతే పాపమెదురైనదన్నట్లుగా పాపాని కొడిగట్టవలసి వచ్చెనా మహాదేవా!' అని వాపోయినాడు.

ఆవీధిచివరనే ఉన్నది కైలాసు బాబాయి యిల్లు. హరిదయాల్ అక్కడికివెళ్ళి చూచినాడు కేకవేసినాడు. ఎవరును పల్కలేదు. సరాసరిలోనికేగి చూచినాడు. లోపల కైలాసు ఒకచిన్నదీపము ముందు చదరంగము పెట్టుకొని కూర్చున్నాడు. 'ఏమిబాబాయి! నీవొక్కడవే చదరంగమాడుచున్నావే' అని పల్కరించినాడు.

కైలాస్ తలెత్తిచూచి 'రానాయనా! ఈయెత్తుచూడు!' అన్నాడు. కైలాసుకి చదరంగమున్నచో ఇక అన్నమే అక్కరలేదు. లోకముతో అతనికి నిమిత్తములేదు.

హరిదయాలుకి విసుగుగావున్నది. 'ఏమిచదరంగమో! ఇక్కడనేను కులభ్రష్టుడనై పోవుచున్నా. మీరు చదరంగపు బంటునే రక్షించదలచినారు' అన్నాడు.

అదికైలాస్ చెవివరకు వెళ్ళనేలేదు. 'ఏమిటీ?' అని రెట్టించినాడు.

'ఆవేళ విషయము తెలిసికొన్నారా?'

'ఏమిటీ?'

'ఆనాడు, మాయింట్లో మనమిద్దరము చదరంగమాడుచుండగా-అయిన అల్లరిసంగతి?'

'లేదు. సరిగా వినలేదే! అదేదో చిన్నగోడవై యుం డును. నాకొక్కటే జ్ఞాపకము - ఆవేళ నీ మెత్తులు పారలేదు కదూ!'

పండా విసుగుతోనే 'అవును, ఇట్టే ఓడిపోయినమాట నిజమే. కాని ఆనాటి రభస విననేలేదా?'

కైలాసు ఆలోచించి 'లేదు. నేనేమియు వినలేదు. కాక, మెల్లగా చెవులుకొరికి కొనుచుండగా నాకెట్లు విని పించును! ఒక్కటి ఆనాడు ఆట ఎంతరంజుగా ఉన్నదో గుర్తున్నదా? నీవు మంత్రిని కాపు వేయలేకపోయినావు. చూడు ఇప్పుడుకూడ అదేయెత్తు. కొంచెము దీనికి కాపు పడేరీతి ఆలో చించు, చూతము నీ తెలివి!'

'నీమంత్రి మండిపోయినట్లే ఉన్నది. నేనడిగేది మం త్రిగోలకాదు, నాగోల విన్నారా అని.'

కైలాసు హారిదయాలుని తేరిపారచూచి దయతో 'అరే, నే వినలేదే. నాకేమియు జ్ఞాపకమే లేదు బాబూ!' అన్నాడు.

హారిదయాల్ కొంచెము సేపు మౌనముగా ఉండి 'బా బాయ్! నీకీలోకముతో సంబంధమున్నను, లేకపోయినను పరలోకము నొప్పుకొందువా?'

'దానికేం? ఎందుకొప్పుకోను?'

'అట్లయిన మీరు పుణ్యముకోసమై చేసిన పనేమ న్నది? ఏది, కనీసమొక్క నాడైనను గుళ్ళోకి వెళ్ళినారా?'

కైలాసు ఆశ్చర్యముగా 'బలేమాటకనూ! నేనొక్క సారైనను గుళ్ళోకే వెళ్ళలేదా? బోలెడుసార్లు వెళ్ళినాను.'

హరిదయాళ్ గంభీరముగా 'మీరిరువదియేళ్ళనుండి యీకాశీలో ఉన్నారుకదా, కనీస మిరువదిరోజులుకూడ ఏదేవుని దర్శించలేను. ఇక పూజమాటచెప్పనేలఅక్కర లేదుకదా!'

అతని వాదాన్ని ఖండించుచు కైలాసు 'అది సరి కాదు. ఇరువదికన్న ఎక్కువరోజులే వెళ్ళి యుండవచ్చు, కాని ఒకటిబాధ. నాకు బొత్తిగా తీరిక ఉండదని నీవెరుగుదువుకదా! ప్రొద్దుననే శంభుమిశ్రాతో ఒక్కపందెము వేయకతప్పదు. ఆయన మంచిఆటగాడు. ఆ ఒక్కఆటతోనే మధ్యాహ్నమయిపోవునుకదా! అప్పుడిక నిత్యకృత్యాలు స్నాన - సంధ్యా వందనాలు ముగించుకొని అన్నమువండుకొని, భోజనము చేయుసరికి ప్రొద్దుక్రుంకవచ్చును. అప్పుడు గంగాపాండేగారు: నీవేమైన ననుము, కాని పాండేగారు మంచి చేయితిరిగిన ఆటగాడుసుమా! నన్ను ఊపిరిసలుప నియ్యడు. ఒకవైపునుంచి గుర్రము, మరొకవైపునుంచి ఏనుగుపెట్టి నొక్కివేసినాడు. నేనేమనుకొన్నానో తెలియునా!'

'అబ్బ! ఆగొడవ కేమికాని, మధ్యాహ్నపువేళ నీవేమిచేయుచుందువు!'

'మధ్యాహ్నమా! గంగాపాండేతో, అతని ఏనుగులు రెండు, చూచితీరవలెను కాని...'

'ఆఁచాలులే. మధ్యాహ్నము గంగాపాండే, సాయంకాలము ముకుందగోష్ - ఇంతేకదా - ఇంకనీకుతీరిక యెక్కడిది!' అన్నాడు హరిదయాళు విరక్తితో.

కైలాసు మౌనముగా ఊరుకున్నాడు - హరిదయాలు గంభీరోపన్యాస మారంభించినాడు. అది ఉపన్యాసమే కాదు-

ఉపదేశముకూడ. 'బాబాయి! ఇంక బ్రతికినన్నాళ్ళు బ్రతకవుకదా! కొంచెము పరలోకమును గురించికూడ చూచుకోవద్దా? అక్కడికి చదరంగపు పిక్కలు పనికిరావుకదా!'

కైలాసు పక్కున నవ్వినాడు. 'అవును. చదరంగపు పిక్కలు అక్కడికి పనికిరావు. కాని పరలోకము కోసమెప్పుడో తయారుగానే కూర్చున్నా. పిలుపు రాగానే ఇవన్నీ ఎవరికో యిచ్చివేసి ఆపళముగా వెళ్ళిపోయెదను దీనికోసరమై నాకంత చింతలేదుగా.'

'మరి డబ్బు - దస్కము లేదా? ఏమియు జంకు - గొంకులు లేవా?'

'ఏమియు లేదు బాబూ! నా కమల్ వెళ్ళిపోయినాడు. నా కమల చరణుడు నాకేసి చూచుచు కళ్ళుమూసి కొన్నాడు. ఆనాడే నా భయము - నా జంకును. అన్నీ వానితోనే పోయినవి. ఆ బాధలన్నీ ఎట్లా వెళ్ళినవో కూడ నాకు తెలియదు.' అని చెప్పుచుండగా ఆ ముసలి కన్నులనుండి రెండు నీటి బిందువులు అప్రయత్నముగా జారినవి.

అతని పాతబాధలు లేపి విచారము తెచ్చినను కాని హారిదయాలు పోనీ, బాబాయ్! ఆసంగతులకేమి కాని నా మాటొకటి వింటారా?' అన్నాడు.

'చెప్పు-వినుటకేమి?'

హారిదయాలు జరిగిన సంగతులన్నీ పూసగ్రుచ్చినట్లు చెప్పి 'మరిప్పుడు కర్తవ్యమేమిటి?'

ఆకథ వినుచుండగా కైలాసు నవ్వుముఖము పాలిపోయినది. వణకెడి స్వరముతో 'అట్లా జరిగియుండదు హారి

దయాలు! సులోచన మహాపతివ్రత' అన్నాడు.

'మొట్టమొదట్లో నేనుకూడ అట్టనుకున్నవాడనే కాని స్త్రీల విషయమున ఏమైనను సంభవమే.

'శివశివ' అట్లా అనకు మనుష్యమాత్రులు పుణ్య పాపాలు చేయుచునే యుందురు. అందులో స్త్రీ-పురుష భేద మున్నట్లు నాకు కనిపించదు. నీకు మీఅమ్మసంగతి గుర్తు లేదా? ఆసంగతి అప్పుడే మరచిపోతివా?'

హరిదయాలుకి సిగ్గువేసినది. ఎవరిలోపాలు వారికుం డును. వాటిని తలచుకొనరు ఎవరైనను జ్ఞాపకము చేసినచో చిన్నపుచ్చుకొందురు. 'మరి ఇప్పుడు జాతిపోవుచున్నదే అని దీనికేమి చేయవలసి ఉండును?'

'దానికా? ప్రాయశ్చిత్తము చేసికోవచ్చును. తెలియక చేసిన పాపానికి ప్రాయశ్చిత్తమున్నదికదా!'

'ఉన్నది. కాని మనసంఘీయులు బహిష్కరించెద రేమో!'

'బహిష్కరించనీ'

హరిదయాలు ఉగ్రుడై 'ఏమన్నారు? బహిష్కరించ నిమ్మనా? కొంచెము తెలిసిమాట్లాడండి బాబాయ్!'

'అవును. నేను తెలిసియే మాట్లాడుచున్నాను. నీవి ప్పుడు చిన్నవాడవుకాదు. ఆరవపడిలో పడినావు. ఏదో ఇన్నాళ్లును నీకు జాతి ఉన్నదికదా! ఇకమిగిలిన పదిరోజులు పాటు లేకపోయినచో వచ్చునష్టమేమిటి?

'నష్టములేదుకాని జాతి, ధర్మముపోయినచో భగవం తునికేముం దేమని చెప్పుటయా!' అని.

'ఒక అనాథస్త్రీ కాశ్రయమిచ్చితినని చెప్పు.

హరిదయాలు ఆలోచించసాగినాడు. కైలాస్ చెప్పిన దతనికి మనస్కరించలేదు. 'మరి నేను సులోచన అల్లుని అడ్రసు చెప్పివేయనా?'

'వద్దు సుతరాము చెప్పవద్దు. ఒక త్రాగుబోతు బెదరించి నీవద్దనుంచి, ఒకపెద్దమనిషి వద్దనుంచి, బెదరించి డబ్బు గుంజాలనుకొనుచుండగా నీవా తుంటరికి సాయముచేయుదువా!'

'చేయక ఏమిచేయను? నాకు సర్వనాశనమగును. ఇక నాయింటికి యాత్రికు లెవరునురారు. మరి నిత్యజీవిక?'

'నీకేమియు భయములేదు నాకు ప్రభుత్వమువారు నెలకిరువది రూపాయలు ఫించన్ ఇత్తురుకదా! దానితో మన మిద్దరమును కాలక్షేపముచేయుదము. ఇంతకాచుకొనితిని, చదరంగమాడుకొనుచు నూర్చుందము బయటకే పోవద్దు. సరా!'

ఆమాటలు వినుసరికి కోపమువచ్చినను, కైలాసు నోటినుండి చిన్నపిల్లలమాటలవంటి ముగ్ధవాక్యములు విని హరిదయాలు నవ్వకుండ ఉండలేకపోయినాడు.

'బాబాయ్! నాబరువుకూడ మీ కెందుకు? కాక నేను మరొకరికోసమై నా జాతి నెందుకు పోగొట్టు కొందును అన్నాడు.

'అవునులే. అదేమంచిది వారి ఊరుపేరు-చెప్పి, ఆదరిద్ర బాలికను భర్తనుంచి వేరుచేసి, కులమర్యాదలు గంగపాలుచేయించి, ఇక ఈముసలి యెముకలను కుక్కలకు - నక్క-

లకు దక్కకుండ కాపాడుకొనుట యెంతో మంచిది. చాలమం చిదినాయనా! అట్లేచేయుము. కాని నీవీ విషయము నాతో సంప్రదించకున్నచో బాగుండకపోవు. వచ్చితివి కాన ఒక్కమా టవినిపో. ఈకాశీరాజ్య మనన్యపూర్ణది. నీవిక్కడఉండి ఈరీ తిగా పతివ్రతా బాలికల వెం...టనుట నీకు శ్రేయోదాయక ముకాదుసుమా!' అన్నాడు కైలాసు.

కోపముతో హారిదయాల్ 'నన్ను మీరు శపించు చున్నారా బాబాయ్!' అన్నాడు.

'లేదు. నీవు కాశీపండావు. బాబా విశ్వనాథుని వాహకుడవుకూడ. నాశాపము విన్నంటదు. నీకావిషయమున భయమక్కరలేదు. కాని నీవుజోక్యము కల్గించుకొనే పని మాత్రమునీకు ప్రమాదము లేనిది కాదుసుమా! సతీసావిత్రి అన్నచో యమునికికూడ భయమే. అది నీకావిషయము జ్ఞాపకముచేయుచున్నాను. మనము చిరకాలమునుంచి చదరం గపుటాట కాళ్ళమని, నీమీద నాకున్న ప్రేమకొద్దీ చెప్పితి నంతే.

హారిదయాల్ మాట్లాడలేదు విచారముతో లేచినిల బడినాడు.

'మరినామాటవినవుగదా బాబూ!' అన్నాడుకైలాసు.

'పిచ్చివారిమాట విన్నచో నేనుకూడ పిచ్చివాడను కావలసివచ్చును.'

ఇకకైలాసు మాట్లాడలేదు. హారిదయాల్ వెళ్ళిపోయి నాడు. కైలాసు చదరంగపు పిక్కలను ప్రోగుచేసికొనుచు లోలోన ఇట్లనుకొన్నాడు. 'ఇతడు చెప్పినదే బాగున్నట్లు

న్నది. నా సలహా ప్రకారమైనచో లోకమున పనిజరుగదు. ఎవరైనను చనిపోయి నప్పుడు, దహనమునకు మనుష్యులు, దొరకనప్పుడు నన్ను పిల్చుచుందురు. ఎవరికైనను రోగమువచ్చి సేవచేయవలసి వచ్చినపుడుకాని నన్ను పిల్తురు. కాని నన్ను పరామర్శించుటకు మాత్ర మొకరును రారు ఇదిలోకము.'

ఎంతో ప్రొద్దుపోవువరకును ఆలోచించినను కైలాసుకి నిశ్చయము కుదరలేదు. ఉజ్జ్వలము, స్వచ్ఛమునైన సత్యము జనులకేల గ్రాహ్యముకాదో ఆయనకు బోధకాలేదు.

హరిదయాలు ఆరాత్రిఎంతోసేపు ఆలోచించి ఆలోచించి చంద్రనాథుని పినతండ్రియైన మణిశంకరునికి 'చంద్రనాథ్ ఒక వేశ్యబాలికను వివాహమాడి, ఇంటికి తీసికొని వెళ్ళినట్లు' సంగతులు వివరించుచు జాబు వ్రాసినాడు.

౨

హరిదయాలు వ్రాసినాడు కాబట్టి ఆవార్త అసత్యము కానేరదని మణిశంకరునకు విశ్వాసము కల్గినది కాని ఇప్పుడేమి చేయవలెనో అతనికి తోచలేదు. అది తనకు సంతోషాన్నికాని విచారాన్నికాని, యియ్యలేకపోయినప్పటికి, ఈ విషయము మాత్రమెంతో భారమైనదే. ఆభారమును తానొక్కడే అనుభవించుటకు బదులు భార్యను పిలిచి సంక్షేపముగాచెప్పి 'నాడు ముందుగా నాతో సంప్రదించియున్నచో ఇంతమోసము జరిగేదాకి ఏదేమైనను ఇది మాత్రము వెల్లడి కాకూడదు. బాగాఆలోచించవలసిన విషయమిది' అన్నాడు.

కర్తవ్య నిర్ణయానికి కొంతఆలోచన, ఆలోచనకు కాలము అవసరము. కాని స్త్రీలలో ఆవ్యవధిని సహించే గుణముతక్కువ. ఆనోట ఆనోట అప్పుడే ఆసంగతి నల్గురికి తెలిసినది. క్రమముగా ఆసంగతి తెలియనివారు లేరు. మణిశంకరుని కూతురికి పెళ్ళివారువచ్చినసంగతి హరిబాలకుకూడ తెలిసినది. అందుచేతనే ఆమెసరయుని ఆమెభర్తయెట్లా ప్రేమించుచున్నదియనిఅడిగినది. ఆరోజున ఆదంపతులయాళ్ళముతో ఎంతో తర్జన-భర్జన జరిగినది. వారు చంద్రనాథ్ ప్రేమించే ప్రేమ యొక్క విలువపై సరయు భవిష్యత్తు ఆధారపడి ఉన్నదని నిర్ణయించినారు.

అందరును గుసగుస లాడుకొను చున్నారు. అందరి ముఖాలలోను, కన్నులలోను వారి హృదయాలలో పొంగి పొరలే ఏదోవికృతానందము ప్రస్ఫుటమగుచునే యున్నది. అందరును విచారమును ప్రదర్శించుచున్నారు. ప్రతివారును నిట్టూర్పులు వదలుచున్నారు. అందరి హృదయాలలోను ఎక్కడో సరయునుగూర్చి 'అయ్యో! పాపము!' అనాలన్న బుద్ధియే ఉన్నది. అనానుభూతిని యెంతో చాకచక్యముతో పరస్పరము వ్యక్తపరచుకునేందుకే వారందరును ప్రయత్నించుచున్నారు. రెండురోజులనుంచి వారికి తహతహతో నిద్ర యేపట్టుట లేదు.

అట్లా అట్లా వారము గడచినది. ఈవారములో రెండుంబవళ్ళు పొగలు రాజినవేళాని మంటలు లేవలేదు. విషయము గుసగుసలుగానే ఉండిపోయినది. ఈవారము రోజులు వారికి దీర్ఘకాలములాగ గడచినది.

పురుషులలో కూడ ఈసంగతి మెల్లగా ప్రాకినది. వారిలో ఇంతఅలజడి లేదు. ఉన్నదేదో కార్యరూపమును తాల్చవలెననియే. చంద్రనాథుని జాతిభ్రష్టుని చేయుటకు ముందుగా చేయవలసినది చాలగా నున్నది. ఆకర్తవ్యమును గూర్చి నిర్ణయించుటకై కూర్చున్న-గుమిగూడిన మగవాళ్ళు ఒక నిర్ణయానికి రాకముందే ఇంటిపనులపై వెళ్ళిపోవలసి యుండేది. కాక ఇది సామాన్యవిషయమైనను, చంద్రనాథుడు బీదవాడైనను క్షణికములో తేల్చివేయువారే. కాని ఇక్కడ చంద్రనాథుకి వ్యతిరేకముగా బహిష్కరణోద్యమము లేవదీయుట కెవరికిని చొరవలేదు. అట్లు చేయగల్గిన వ్యక్తి ఒక్కమణిశంకరుడే. అతడిప్పుడు ఊరుకునేయున్నాడు. అందుచేత విషయ మటూ-ఇటూ కాకుండ ఉన్నది.

ఇకతప్పని సరియై ఇరుగుపొరుగుల అమ్మలక్కలే ఈ విషయములో తగు శ్రద్ధవహించినారు. వారు నిష్పాపులై హరకాళీ వ్రజకిశోరులు జాతిభ్రష్టులు కాకుండ రక్షించవలెనని పూనుకున్నారు. సరయుతల్లి కాశీలో వేశ్యఅని ఋజువైనదని, కావున వేశ్యకూతురు తాకినపదార్థములు తినుటచే వారు జాతి-ధర్మభ్రష్టులు అయినారని విచార పూర్వకముగానే చెప్పినారు.

మొదటలో హరకాళి తెల్లపోయి చూచుచు, నిలబడిపోయినది. మెల్లగా తేరుకొని 'ఆఁ' ఏమిజరిగినదేమిటి?' అని అడిగినది.

రామమయుని ముసలవ్వ పెద్దగా నిట్టూర్పువుచ్చుచు 'ఇంకేంజరగాలి పెద్దమ్మగారూ! జరగవలసిందే జరిగింది.

అంతా సర్వనాశనం అయిపోయింది.' అని ఒక్కొక్కటిగా కథంతయు చెప్పినది. ఆమె పొరపాటున ఎక్కడైనను ఒక చిన్న విషయము మరచినచో, ప్రక్కనున్న అమ్మలక్కలు అతుకు కలిపెడివారు. హరకాళి నిజముగానే సర్వనాశనమైన దని గ్రహించినది. అయినను అదితనకెంత బాధాకరము, మరొ కరికెంత అనేది తెల్సుకునే నిమిత్తమై గదిలోనికిపోయి తలు పులు బిగించుకొని కూర్చుండి ఆలోచనలో మునిగినది. అది చూచిన అమ్మలక్కలకు తాము చెప్పుట మంచికో చెడ్డకో బోధకాలేదు ఒక్కరొక్కరే చల్లగా జారుకున్నారు.

హరకాళి తనగదిలో ఒంటరిగా కూర్చున్నది. ఈ మండిపోయేవార్త ఎంతవరకు ప్రజ్వరిల్లును? 'ఒకవేళ ఈవార్త పూర్తిగా నిజముకాకపోయినను ... మరిగతి? అయినను తన అదృష్టముపండి, నిజముగా భగవంతుడు తనపాలిటనున్నచో ఇంకేమి కావలెను? తనచెల్లిలి కూతురుకింకను పెండ్లికాలేదు కదా! ఇప్పటికే అసలు పెళ్లియీడువచ్చినది. ఏదేమైననుసరే చేయగలంతశక్తితో కృషిచేసి తీరవలె.' అని ఆలోచించు కొని తటాలున తలుపుతెరచుకొని చంద్రనాథ్ చదువుకునే గదిలోనికి వెళ్లినది.

చంద్రనాథ్ ఆమె ముఖకవళికలు గమనించినాడు. ఏదో మునిగినదనుకొని 'ఏమిజరిగిందత్తా?' అన్నాడు.

హరకాళి నోరుకొత్తి మొదుకొనుచు 'నాయనా! చంద్రా! మేము దరిద్రులమనేనా నీవిట్లు మమ్మల్ని శిక్షిం చడం?' అన్నది.

చంద్రనాథ్ మనస్సు మొద్దువారిపోయినది. అతడు చేసిన ద్రోహమేమిటో ఎంతఆలోచించినా గోచరముకాలేదు.

హరకాళి చెప్పసాగినది 'ఇంకేమి మిగిలినదినాయనా! పట్టెడన్నముకోసమై మాజాతి-ధర్మము కోల్పోయినాము. మాకు తినుటకే ఉన్నచో నీవిట్లు చేయుగలవా?'

చంద్రనాథ్ కొంచెము సేపూరకుండి శాంతముగా 'అసలు జరిగిన దేమిటమ్మా?' అన్నాడు.

హరకాళి పైటతో రాని కన్నీళ్లు తుడుచుకొనుచు, 'మాఅదృష్టములో వ్రాసిపెట్టిఉన్నంతయు జరిగినది. అయ్యో నాబంగారమా! నిన్నాపిశాచికలు వలలోవేసికొని ఎంత కొంపకి గుండము తెచ్చిపెట్టినారురా?' అన్నది.

'అబ్బ! అత్తా! నీకాళ్లుపట్టుకుని బతిమాలెదనుకాని జరిగినదేమిటో చెప్పు.

'నేనేమి చెప్పగలను? వెళ్లి మీబాబాయ్యనే అడుగు నాయనా!'

'నేనెళ్లి మాబాబాయి నడిగి తెలిసికొనేటట్లయిన మరి ఈ గొడవెందుకు?' అన్నాడు విసురుగా.

'నాయనా! సర్వనాశనం అయిపోయింది కనకనే నా యేడుపులంతాను' అన్నది.

చంద్రనాథ్‌కి మేనమామా మేనత్తలపై శ్రద్ధాభక్తి లెక్కువగానే ఉన్నవి. కాని ఇట్లాచేసినచో ఎవరికైనను విరక్తిరాకమానదు అందుచేత మరింత మండిపడి 'సర్వనాశనమే అయినచో మరెక్కడికైననుపొండి. అంతేకాని నాయెదుటనేఉండి గొడవచేయవద్దు.' అన్నాడు.

హరకాళి చంద్రనాథ్ తల్లి పేరెత్తి 'అయ్యో! వదినా! నువ్వు మమ్మల్ని పిలిపించి ఆదరిస్తే, యీనాడు నీకొడుకు లేవగొట్టుతున్నాడమ్మాయి!' అని విలపించసాగినది.

చంద్రనాథ్ కంగారుపడి ఆమెచేతులు పట్టుకొని 'అత్తా! నీవుస్పష్టముగా చెప్పనిచో నాకెలా తెలియునో చెప్పు ఊరకే 'సర్వనాశనం సర్వనాశనం' అందువేకాని ఫలానా అని చెప్పవామె.' అన్నాడు.

హరకాళి కన్నీరు తుడుచుకొనుచు 'ఏమినాయనా? నీకేమియు తెలియనే తెలియదా?' అన్నది.

'తెలియదు.'

'మీబాబాయికి కాశీనుంచి పండాగారు ఉత్తరము వ్రాసినారు'.

'ఏమని?'

హరకాళి సర్దుకొని తలవంచుకొనే 'నాయనా! నిన్ను ఒంటరిగా పట్టుకొని ఆపిశాచాలు వాళ్ళవలలో వేసికొన్నారు ఒకభోగపుపిల్లని పెళ్లిచేసినారు నాయనా!'

చంద్రనాథ్ తేరిపారచూచి 'ఏమిటీ? ఎవరిపెళ్లి చేసినారు?' అన్నాడు.

హరకాళి నెత్తిబాదుకొనుచు 'నీదే'

చంద్రనాథ్ అత్తకు దగ్గరగాజరిగి 'భోగపుదానితో పెళ్లిఅయినదినాకా?' అని అడిగినాడు.

'అవును. నీకే.'

'అనగా, పెళ్లికిముందు సరయు వేశ్యావృత్తిలో ఉండేదా? అత్తా! ఆమెపెళ్లికి పదేళ్ళపిల్లేకదూ?'

'అదేమోకాని దీనితల్లికి మాత్రము మహాచెడ్డపేరు న్నదట కాశీలో.'

'ఓహో! ఈమెతల్లి వేశ్యఅన్నమాట. ఈమెకాదు గదా!'

హరకాళికి లోలోపల తనయెత్తు పారలేదని కంగారు బయల్దేరింది. 'కాదునాయనా! ఏదైనా ఒకటేగా!' అన్నది.

చంద్రనాథ్ ఒక్కకసరు కసరి 'అత్తా! నీవెవరితో చెప్పుచున్నావో ఎరుగుదువా? నీకేమైన పిచ్చెక్కినదా?' అన్నాడు గంభీరముగా.

ఆ కసరుతో హడలిపోయి హరకాళి ఏడ్చుచు 'పిచ్చెత్తించెడి సంగతేగా జరిగినది. మాయిద్దరికి ప్రాయిశ్చిత్తము చేయించు. తర్వాత ఈకాశీక్షేత్రకడికి లాగికొనిపోతే అక్కడికే పోయెదము. ఈభ్రష్టుకూటుకన్న అడిగికొని తినుటయే మేలు అన్నది.

చంద్రనాథ్‌కి కోపమువచ్చినది. 'అవును. అదేమంచిది.' అన్నాడు.

'అట్లయిన మమ్మల్ని వెళ్లి పొమ్మందువా?'

చంద్రనాథ్ మొగము ప్రక్కకు త్రిప్పుకుని 'అం పొండి.' అన్నాడు.

ఆమాటతో నోరు - నెత్తి మోదుకుని హరకాళి 'అయ్యో! చివరికిదా మాత్రావాత?' అన్నది. చంద్రనాథ్ ధైర్యముగా 'ఇంతకును నీవువిప్పిచెప్పవుగా?

'అంతయు చెప్పితిగదా!'

'ఏమిచెప్పితివి? అసలుత్తరమేదీ!'

'మీబాబాయి దగ్గరనేఉన్నది.'

'అందులో ఏమి వ్రాసి యున్నది?'

'అదేగదా చెప్పినాను.'

చంద్రనాథ్ వెళ్లి ఒకకుర్చీమీద కూర్చున్నాడు. సిగ్గు కోపాలతో అతని ఆపాదమస్తకం మండిపోవుచున్నది. శరీరము వివశమైనది. అతని నోటినుండి అప్రయత్నముగా 'శివ శివ' అనిమాత్రము రెండుమూడుమాటలు వచ్చినవి

చంద్రనాథుని అప్పటి ఆకారము చూచుటకు హరకాళికే భయమువేసినది ఆ[illegible] దృశ్యము ఎప్పుడును ఎవరును ఎక్కడను చూడలేదేమో? ఆమె మెదలకుండ లేచి వెళ్లిపోయినది.

'ఏమిటి ఆ ఉత్తరము చూడవచ్చునా?' అని అడిగినాడు చంద్రనాథ్.

మణిశంకర్ మాట్లాడకుండ ఒకపెట్టెతెరచి జాబు తెచ్చి అతనిచేతికిచ్చినాడు. చంద్రనాథ్ దానిని ఆమూలాగ్రం రెండుమూడుసార్లు చదువుచున్నాడు. అతని స్వాంతము క్షీణించినది.

'దీనికి ప్రమాణము?' అని ప్రశ్నించినాడు.

'రాఖాలుడే స్వయముగా వచ్చుచున్నాడుగా.'

'వానిమాటలు నమ్మనేమిటి?'

'అది నేనేమియు చెప్పలేను నీకు తోచినట్లు చేసికొనుము.'

'అతనువచ్చుట యెందుకు? ఈవిషయము బుజువు చేసినచో అతనికేమిలాభము.'

'లాభముసంగతి ఉత్తరములోనే ఉన్నదికదా! రెండు వేల రూపాయలు కావలెనట.'

మణిశంకరుని కేసి నిబ్బరముగా చూచుచు, చంద్రనాథ్ 'ఈవిషయము బయటపెట్టకపోయినచో వాడు బెదరించిడబ్బు రాబట్టుకొనేవాడేమో! కాని యిప్పుడు వానియాశ నిరాశ యైనది. అంతయు బట్టబయలైనదికదా! మీరు నాకీరకముగా ఉపకారమే చేసినారు. అడబ్బునాకు మిగిల్చినారు.'

మణిశంకరుడు సిగ్గుతో తలవంచుకున్నాడు. తనకు తానై యీసంగతి బట్టబయలు చేయలేదని చెప్పవలె నను కొన్నాడు కాని బయటపెట్టుటకు కారణము తానే అనిగుర్తు వచ్చినది. ముందుగా తనభార్యకు చెప్పియుండనిచో బయటి కెట్లు పోవును అని తలచుకొని ఊరుకొన్నాడు.

చంద్రనాథ్ ఇట్లాఅన్నాడు. 'ఈఊరునాది, అట్లయి నను, ఒక చిన్నబిచ్చగాడు ఏచోరవతో ఇక్కడికి వచ్చి నన్నవమానించగలడు అని మిమ్మల్నిఅడుగుటలేదు. కాని, నేను చచ్చిపోయినచో మీరు సుఖముగా వుండగలరా బాబాయ్! అనే అడుగుచున్నాను.'

మణిశంకర్ నాలుక కొరికికొని 'రామరామ 'చంద్ర నాథ్! ఇట్టిమాటలు సివనబోకు నాయనా!' అన్నాడు.

'ఇకముందెప్పుడు నిట్టిమాటలనవలసిన అవసరము పట్టదులెండి. మీరు నాకు పూజ్యులు. ఈరోజున నావలన నేదైన నపరాధమే జరిగినచో, నన్ను క్షమించండి. నాకున్న యావదాస్తి మీరే తీసికొనండి. అంతయు తీసికొని నామీద అనుగ్రహించండి అంతే. నేనున్నచోటికి నెలనెలా కొద్దిగా

డబ్బుపంపండి. ఇంతకు మిక్కిలి మిమ్ములిన్ని ఇంకేమియు కోరనని భగవత్సాక్షిగా చెప్పుచున్నాను. కాని యిక మీరు నాకుమాత్రము సర్వనాశనము తలపెట్టకండి.' అని అనుచుండగా అతని కంఠము రుద్ధమైనది. పళ్ళతో పెదవులను నొక్కుచు అతికష్టముమీద ఏడుపు నాపుకొన్నాడు.

మణిశంకర్ లేచినిలబడి చంద్రనాథ్ చేతులుపట్టుకుని గట్టిగా నొక్కుచు ఏడ్చినాడు. 'నాయనా! చంద్రనాథ్! నాఅన్నగారి వంశమునకు నీవొక్కడవే ఉన్నావు. ఇంక నీ యీ ముసలిబాబాయిని మాత్రము తిరస్కరించకుమని నిన్ను కోరుచున్నాను అన్నాడు.

చంద్రనాథ్ మొగము ప్రక్కకు త్రిప్పుకొని, కన్నీరు తుడుచుకొనుచు 'బాబాయ్! నేను మిమ్ములిన్ని తిరస్కరించుటలేదు. కాని ఇంతటియుపద్రవము వచ్చిపడినాక దేశము వదలిపోవుటకన్న నాకింకొక మార్గములేదు. నేను మీతో చెప్పుచున్నది దే.

మణిశంకర్ ఆశ్చర్యముగా నాయనా! నీవు దేశము వదలుటదేనికి? నీపెళ్ళి తెలియక చేసికొన్నావు. ఇందులో నీవేమియు సిగ్గుపడవలసిన పనిలేదు. ఇందుకు ప్రాయశ్చిత్తము చేసికొన్నచో సరిపోవునని నానిశ్చయము.' అన్నాడు.

చంద్రనాథ్ మాట్లాడలేదు. మణిశంకర్ ఉత్సాహముతో మరలచెప్పనారంభించినాడు 'దీనికుపాయాలుచాలగా నున్నవి. నీవుముందుగా కోడలిని వదలివేసి, తర్వాత ప్రాయ

శ్చిత్తము చేసికొనుము. మరొకవివాహము చేసికొని కాలము గడుపవచ్చును అంతే. దీనితో అన్నిబెడదలు వదలిపోవును.

చంద్రనాథ్ వణకినాడు.

మణిశంకరుడు రగడదేరినవాడు. ఆవిషయము గ్రహించినాడు. చంద్రనాథ్ కేసి తదేకదీక్షగా చూచినాడు.

చంద్రనాథ్ అన్నాడు. 'బాబాయ్! నేనెట్లును ఆమెనువదలలేను.'

'కాదునాయనా! నీవే వదలగల్గుదువు. ఇన్నాళ్లిటికి విశ్రాంతి తీసికొను. రేపు విశ్రాంతిగా ఆలోచించినచో అది కష్టముకాదని నీకేతోచును. కాని ఇంకకోడలిని మాత్రమే రీతిగాను ఇంటిలో నుంచుకొనుటకు వీలులేదు.

'తగినంత ప్రమాణములేకుండ ఎట్లా వదలమందురో మీరేచెప్పండి?'

మణిశంకర్ కొంచెమాలోచించి 'అది ఋజువుకావలసిన అవసరమంతగా లేకుండనే నొకఉపాయము చేయుదును. కాని నీవెట్లును ఆమెను వదలకతప్పదు. ఆమెను వదలి, ప్రాయశ్చిత్తము చేసికొన్నచో గొడవయుండదు' అన్నాడు.

'ఎట్లా లేకుండపోవును.'

'నేను చేయుదుగా'

'అసలు నిజమేమో తెలిసికోకుండ నేనా?'

'కావలెనన్నచో తర్వాత విచారణచేయవచ్చు. కాని ఇది అబద్ధము మాత్రము కాదని నేనునిశ్చయముగా చెప్పగలను.'

చంద్రనాథ్ తనయింటికిపోయి గదిలో తలుపులు వేసికొని పరున్నాడు.

'సరయును వదలవలెను.' మంచముమీద పరుండి శూన్య దృష్టితో పైకిచూచుచు, కలలో అనుకొనునట్లుగా తనలో తా నదేయిదిగా అనుకొనసాగినాడు. 'సరయు భోగపు పిల్ల, ఆమెను వదలవలెను.' ఈమాటనే ఎన్నోసార్లు ఎన్నో విధాలుగా ఉచ్చరించుకొని, తనచెవులతో తానేవిన్నాడు. కాని అది తనకేమియు బోధపడలేదు. తాను సరయును పరిత్యజించినాడు. ఆమె [illegible] తనకన్నులయెదుట లేదు. ఎక్కడను లేదు. ఆమెకు అతనికి సంబంధము లేదు. ఆమె అతని సొత్తు కాదు. ఏమిటిది! దీనియథార్థస్థితియేమిటి? ఎంతప్రయత్నించినను అతనికొక నిశ్చయము కుదరలేదు.

మణిశంకర్ అదంత కష్టమైన పనికాదని అన్నాడు. కాని అవునో కాదో తెలిసికొనగలశక్తి తనకున్నదో లేదో కూడ, అతడు గ్రహించలేక పోయినాడు.

అతడొక నిర్జీవ ప్రతిమవలె పరున్నాడు. ఎట్టకేలకు నిద్రపట్టినది. నిద్రలో ఎన్నోకలలువచ్చినవి. వాటిలో కొన్ని స్పష్టముగాను, కొన్ని అస్పష్టముగాను ఉన్నవి. ఆనిద్రలోనే ఏదోచెప్పలేని బాధతో అతని దేహము తిరిగిపోయినట్లుకూడ అతనికి జ్ఞాపకమున్నది. చీకటిపడబోవుసరికి అతనికి, మెలకువ వచ్చినది. లేచికూర్చున్నాడు. అతనిమనస్సులో మమకారమనేది పోయినది. ఏదో తెలియని అవ్యక్తమైన తలవంపుతో మనస్సు క్రుంగిపోయి శరీరాన్ని కుదించి వివశముచేసి వేసినట్లనిపించింది.

అంతలో నౌకరు దీపమును వెలిగించి తెచ్చి తలుపు తట్టినాడు. చంద్రనాథ్ లేచి తలుపు తెరచి గదిలో పచార్లు చేయసాగాడు. కన్నులకు దీపప్రాంతము కనుపడుసరికి 'ఇదినిజమేనా? సరయు జీవితమును తెలియునా?' అన్న సందేహము కలిగినది.

సరయు ఎరిగియుండి కించిత్తన్యాయము చేయునని అతడు నమ్మలేకపోయినాడు. అక్కడినుంచి వెంటనే సరయు పడకగదిలోనికి వెళ్ళినాడు.

సరయు దీపము వెలిగించుకొని కూర్చున్నది. భర్త వచ్చుటను చూచి గౌరవముగా లేచి నిలబడినది. ఆమె ముఖములో భయచిహ్నాలు మచ్చుకైనను లేవు. ఆమె శరీరములో రక్తము లేనట్లున్నది 'నీవిదంతయు విన్నావా?' అని ప్రశ్నించినాడు చంద్రనాథ్.

సరయు తలవంచుకొని 'ఆఁ' అన్నది.

'అంతయు నిజమేనా?'

'నిజమే'

మంచముమీద కూర్చుండియే చంద్రనాథ్ 'మరి ఇన్నాళ్ళనుంచి యెందుకు చెప్పలేదు?'

'అమ్మ చెప్పవద్దన్నది. మీరును ఎప్పుడు అడుగలేదు.

'నేను మీ అమ్మకు చేసిన ఉపకారానికి ప్రతియిదేనా మీరు చేసేది?'

సరయు మాట్లాడకుండ నిలబడినది.

చంద్రనాథ్ మరల నందుకున్నాడు. 'నీవంతగా ఎందుకు భయపడెడిదానవో యిప్పుడు తెలిసినది. నేనాత

యిదిగా ప్రేమించినను సుఖమునేల పొందలేకపోతివో, యిప్పు డిప్పుడర్థమగుచున్నది. ఇప్పటికంతయు బయటపడినది. బహుశః ఇంకనే మాఅమ్మ ఇక్కడికి వచ్చుట కంగీకరించ లేదనుకొందును అవునా!'

'అవును' అన్నది సరయు తలవంచుకొనే.

ఆక్షణములో వెనుకటి సంగతులన్నియు జ్ఞప్తికివచ్చి నవి. చంద్రనాథ్‌కి 'సరయుతల్లి మూర్తి, కృతజ్ఞతతోడి ఆమె నేత్రాలనుండి రాలెడి బాష్ప బిందువులు, శాంతవచనాలు, అన్నీ ఒక్కసారిగా మెదడులో మెదలినవి. అతనిమనస్సు కరిగినది. దయతో 'అట్లయినచో సరయూ! అన్నిసంగతు లను నాకు చెప్పగలవా?' అన్నాడు.

'ఆఁ చెప్పుదును నవద్వీపసమీపములో, మామేన మామ గారిల్లుండెడిది. వారియింటికి సమీపములోనే రాఖా లంభట్టాచారి యిల్లుండేది. చిన్నప్పటినుంచి మాతల్లి ఆయ నను ప్రేమించుచుండెడిదట. ఒకసారి యిద్దరికిపెళ్ళిచేయుటకై మాటలు జరిగినవటకూడ. కాని అతనివంశము కొంచెము తక్కువ అనుశంకతో పెళ్ళిజరుగుటకు వీలులేక పోయినది. నాతండ్రిది హోలీపట్టణము. నాకు మూడవయేటనే నాతండ్రి చనిపోయినాడు అప్పుడు నన్నుతీసికొని నాతల్లి నవద్వీపము వచ్చివేసినది. తర్వాత నా అయిదవయేట మాఅమ్మ నన్ను తీసికొని...

'తరువాత!' అన్నాడు చంద్రనాథ్.

'కొంతకాలము మేము మధురలో ఉన్నాము. తర్వా త కాశీవచ్చినాము ఆరోజులలోనే రాఖాలుబ్రాహ్మణుడు ఆరం

భించినాడు. మాఅమ్మ దగ్గరవున్న కొద్దిపాటి నగలకోసము నిత్యము వాదోపవాదాలు సాగినవి. ఆఖరికొకసారి అతడు నగలన్నింటిని ఎత్తుకొనిపోయినాడు. అప్పుడు అమ్మదగ్గర పైసాలేకపోయినది. వారము – పదిరోజులుపాటు బిచ్చమెత్తు కొని మేమెట్లానో పొట్టనింపుకొన్నాము. తర్వాతసంగతి మీరెరుగుదురుగదా!'

చంద్రనాథ్‌కి ఒళ్ళంతయు భగభగ మండిపోయినది. దీనమైన సరయు ముఖమువంక క్రూరముగా చూచుచు, 'ఓసి! నీవిటువంటి దానవా! అంతయు తెలిసియే నాకు సర్వ నాశనముచేసితివా! నీవింత మహాపాపివని నేకలలోకూడ ఆలోచించలేకపోతినే!' అన్నాడు.

సరయు కన్నులనుండి కన్నీటిబిందువులు బొట బొట రాలసాగినవి. తలవంచుకొనే నిలబడియున్నది.

సరయు ఏడ్పుటను చంద్రనాథ్ చూడలేకపోయినాడు. గుండెదిట్టవుచేసికొని 'మరిప్పుడుపాయమేమిటి?' అని అడిగి నాడు.

సరయు కన్నీరు తుడుచుకొనుచు 'మీరేచెప్పండి' అన్నది.

'సరే ఇట్లా దగ్గరకిరా!'

సరయు దగ్గరకువచ్చినది. చంద్రనాథ్ గట్టిగా ఆమె చేతినిపట్టుకొని 'నిన్నువదలుమనిలోకులుచెప్పుచున్నారు. కాని నాకంతటి సాహసము కలుగుటలేదు. నీయందు విశ్వాసము లేదు.'

సరయు తెల్లపోయిన ముఖములో ఎఱ్ఱని రేఖలు మెరసినవి. కన్నీరు క్రమ్మిన కళ్లు క్షణములో మెఱిసినవి. 'మీకునామీద విశ్వాసమే లేదా?'

'లేదు, అసలు లేదు. నీవేమైనను చేయగలవు.'

సరయు భర్తముఖములో ముఖము పెట్టి నిశ్చలస్వరముతో 'నాకు మీ రేమగుదురో, నాకు తెలియును. ఒకనాడు మీరు నన్ను మీముఖమువంక తేఱిపారచూడుమన్నారు. ఈరోజున నే కోరేదీ అదే. నేనొక్క ఉపాయము చెప్పెదను. వింటారా?'

'ఓఁ: వింటాను. ఏమిటది?'

'నేను విషముతిన్నచో సొరిపోవునుకదా!'

చంద్రనాధ్ చేతిపట్టు మఱింత బిగువైనది – ఆమె తప్పించుకొని పోకుండ నేమో–

'ఆఁ అదికూడ చక్కని ఉపాయమేఁ. మరినీవు విషముతినగలవా?'

'ఆఁ తిందును.'

'చాల జాగ్రత్తసుమా! ఎవరికిని తెలియరాదు.'

'ఓఁ అట్లానే.'

'ఇవ్వాళ నేనా?'

'సరే, ఇవ్వేళనే.' అన్నది సరయు.

భర్తలేచి వెళ్ళిపోవుచుండగా అతని రెండు పాదాలు పట్టుకొని 'నన్ను దీవించనైనను లేమ' అన్నది పాపము!

చంద్రనాథ్ పైకిచూచుచు 'ఇప్పుడుకాదు. నీవుపో యిన తర్వాత – నీశరీరంకాలి మసిఅయినతర్వాత, దీవించ గలనులే.' అన్నాడు.

సరయు పాదాలువదలి 'సరేమంచిది. అప్పుడే కాని వ్వండి ' అన్నది.

చంద్రనాథ్ వెళ్ళుచుండగా ఆమె మరొకసారి దారి కడ్డువచ్చి 'నేను విషము తిన్నందువలన మీకేమియు ప్రమా దము రాదుగదా!' అన్నది.

'ఏమి? లేదు.'

'ఎవరును అనుమానించరుకదా!'

'తప్పక అనుమానింతురు. కాని డబ్బుతో వారినో ళ్ళకు తాళంవేసి వేయుదును.

'నేనొక ఉత్తరము వ్రాసి తలగడక్రింద పెట్టిపోయె దను. దానిని మీరు వారందరికిని చూపండి.'

చంద్రనాథ్ ఆమె తలపై చేయివేసి 'అట్లేచేయుము. నేను చంపితినని ఎవరును అనుమానించుటకు వీలులేకుండ వ్రాసి, క్రింద సంతకము చేయుము. తలుపులు కిటికీలు మూసి గడియలు బిగించు. బయటికి నాకేమియు చప్పుడు వినిపించ రాదుసుమా?' అన్నాడు. సరయు దారివదలి 'తప్పకొ'న్నది. నేలకొరిగి భర్తపాదాలకు మరొక్కసారి నమస్కరించినది. ఆపాదధూళి తీసి తలమీదధరించి 'సరే, ఇకవెళ్ళండి'అన్నది.

ఆమాట అనగానే మరల నేమి అనుమానముతోచి నదో 'కొంచెమాగండి' అని దీపపు వెలుతురులోనికి తీసికొని

వెళ్ళి భర్త మొగముకేసి తేరపారచూచి ఉలికిపడినది. చంద్రనాథ్ కన్నులలో ఏదో క్రౌర్యము మెరయుచున్నది

'సరయూ! నాకన్నులలో ఏమి చూచుచున్నా' వని అడిగినాడు చంద్రనాథ్.

సరయు కొంచెముసేపు మౌనముగానుండి 'అబ్బే ఏమియునులేదు. ఇక వెళ్ళండి.' అన్నది.

చంద్రనాథ్ మెల్లగా బయటికి 'అంతే అట్లేజరుగ వలెను. ఇవ్వేళనే' అని గొణుగుకొనినాడు.

## ౧౦

ఆరాత్రి సరయు తిరిగివెళ్లి వెక్కి వెక్కి ఏడ్చినది. 'నే నెట్లాను విషముతినలేను. ఒక్కతెనే అయినచో తినెడి దాననేమోకాని ఇప్పుడు గర్భవతినాయె. ఏతల్లి చేతులార సంతానమును చంపుకొనగలదు.?' అని పరిపరివిధాల విచారించినది తనలో. తుదకామె చనిపోలేక పోయినది. కాని యిక తనకు సుఖపడురోజులు లేవని నిస్సంశయముగా అనుకొన్నది.

అర్ధరాత్రివేళ చంద్రనాథ్ తనభార్యగదిలోకేగి అంతయు చూచి ఆవేగముతో ఆమెను కౌగిలించుకొన్నాడు. 'వద్దుసరయూ! నీ వెప్పుడును బలవంతపు చావు చావవద్దు.' అన్నాడు.

అంతేకాని అంతకన్న ఆమె నేవిధముగాను ఓదార్చ లేకపోయినాడు. ఆ హతభాగ్యురాలి విషణ్ణముఖమును తొలగించుట కావిశాలభవన ప్రాంగణములో అతనికి చోటే

దొరకలేదు. ఆమె నేడికన్నీటిని తుడుచుకొనుటకు తగిన యాశ్రయమిచ్చుట కాయూరిలోనే మమకారము కలవారు న్నట్లతనికి తోచలేదు. ఆమె తెగవిలపించి చివరి కొకవారము రోజులు గడువిమ్మని కోరినది. ఆభాద్రపదమాసము తుది వారములో మాత్రము భర్త ఆశ్రయమున ఉండి తర్వాత శాశ్వతముగా నిరాధారియై బిచ్చగత్తె అయిపోవును. భాద్రపదమాసములో ఇంటినుండి కుక్కనైనను, పిల్లినైనను వెడలగొట్టరు. అది కుటుంబానికి కీడు. అందుచేతనే సరయు ప్రార్థన మంజూరు చేయబడినది.

ఒకనాడామె భర్తచేతులు పట్టుకొని 'నా వ్రాతలో వున్నట్లు నే ననుభవించి తీరుదును. దానికై మీరేమియు విచారించకండి. ఈ దురదృష్టవంతురాలి నింటికి తెచ్చినందుకు మీ రెన్నో కష్టాలు పడినారు. ఇకకష్టపడవలదు. నన్ను సాగనంపి ఇంకొకసంసార మేర్పరచుకొనండి నా కాపురాన్ని నాశనం చేయకండి' అన్నది.

చంద్రనాథ్ మౌనముగా నుండిపోయినాడు. అతని కేమి బదులుచెప్పవలెనో తోచలేదు. సరయు ఇప్పుడు నిర్భయముగా మాట్లాడుచున్నదని గ్రహించినాడు. ఇంతవరకు నున్న భయమిప్పుడామె మనస్సులో లేదు. మొన్నటి వరకు నామె భయము,ముసుగులో ముఖముచాటుచేసికొనితిరిగెడిది. ఇప్పుడా జంకులేదు. లోపలఉన్నంత చెప్పుచున్నది. ఆమె కున్న సర్వస్వమును- భర్తను, ఇప్పుడు సమాజము బహిరంగముగా వేలము వేసినది. ఇప్పుడామె ఋణవిముక్తయై కానిలేని సన్యాసినియైనది. కనుకనే భర్తతో చాటుమాటు లేకుండ

మాట్లాడుగల్గుచున్నది. మిత్రునిలాగ, గురువులాగ ఉపదే శించి, నిర్భయముగా తన అభిప్రాయమును వ్యక్తపరచు చున్నది. ఆనాటిరాత్రి ఇద్దరును క్షమించుకొన్నారు. విషము తినుమనుటలో ఆమెదోషము లన్నియు పోయినవి.

మరునాటి ఉదయముననే హారకాళి తనభర్తచేత స్టాంపు అతికించిన కాగితముమీద ఏదో వ్రాయించుచున్నది. 'ఇదంతయు ఎందుకు?' అని వ్రజకిశోరు డడిగినాడు.

హారకాళి ఒక్కొకసరుకసరి 'మీకేపాటి తెలివితేటలే వున్నను ఆ ప్రశ్న అడుగరు. అట్లు అప్పుడును నామాటవి నక చెడగొట్టినారు. అందుచేతనే ఇంతరభస జరిగినది. ఇంకే విషయములోను పెదవి మెదపవద్దు.' అన్నది.

ఆమె చెప్పినదంతయు ఉత్త లేఖనము జాగ్రత్తగా వ్రాయు పిల్లవానివలె వ్రజకిశోర్ వ్రాసినాడు. పూర్తిఅయి నాక హారకాళి ఆకాగితము పుచ్చుకొని రెండుసార్లు చదువు కొని తలూపుచు 'బాగానే ఉన్నది' అనుకున్నది.

వ్రజకిశోరుడేమియు మాట్లాడలేదు. మధ్యాహ్నము ప్రొద్దు దిగవ్రాలిన తర్వాత హారకాళి ఆకాగితముతో సర యువద్దకు వెళ్ళినది. ప్రియముగా ఉన్నట్లు 'అమ్మాయీ! దీని మీద కాస్త సంతకంపెట్టమ్మా!' అన్నది.

సరయు ఆకాగితమును చేతితో పుచ్చుకొని 'ఎందుకు' అని ప్రశ్నించినది.

'నేను చెప్పినట్లు చెయ్యిపిల్ల!

'దీనిమీద సంతకం పెందుకు చేయవలెనో కూడ తెలిసి కోరాదా?'

హారకాళి మూతి సాగదీసికొనుచు 'ఇదంతా నీకే మంగోరి చేసేపనేనే. నువ్వు వెళ్లిపోయేక నువ్వెక్కడుండేది, ఎట్లావుండేది మేం తెలుసుకోం కదా! అయినా నీ ఇష్టం వచ్చినచోట ఉంటావు. దానికేం. కాని ఏదో నెలకో అయిదురూపాయిలు నీకు తిండికివస్తూంటాయి కదే. ఇదేమన్నా చెడు అంటావా?' అన్నది.

సరయుకి తలనుంచి - చెమటలు తేలినవి. ఆవిడ హృదయములో ఎంత శ్రేయోభిలాష ఉన్నదో యెరుగక పోలేదు. కాని భవనమే వరదపాలై కొట్టుకొని పోవుచుండగా, పెంకుముక్కలకోసము పాటుపడెడి ప్రయత్నమేమి చేయవలెననుకొనలేదు అట్లనుకొన్నను ఒక్కసారి హారకాళి వంకచూచినది. ఆచూపును చూడలేక భయపడినది హారకాళి. తనచూపు క్రిందికిపెట్టి 'పిల్లా!' అన్నది.

'ఆఁ. వ్రాసియిచ్చుచున్నానుగా పిన్నీ!' అని సరయు దస్కతుచేసి కాగితము నిచ్చివేసినది.

ఆనాడాశ్వయుజ శుద్ధవిదియ. సరయు వెళ్లెడిరోజదే. విలువైన బట్టలను అలమరలో సర్ది తాళాలువేసినది. ఆభరణాలను ఇనుపపెట్టెలోపెట్టి బీగము బిగించినది. భర్తనుపిలుచుకొని రమ్మని మనుష్యునిపంపి, తను క్రింద వెక్కి వెక్కి ఏడువసాగినది. ఇల్లువదలే సమయము సమీపించిన కొలది విచారమెక్కువగుచున్నది. గడచిన వారమువలె ఈరోజు గడువదు. ఇవ్వేళ కూడ తనధైర్యము నిలువదేమోనని అనుమానించసాగినది. వెళ్లిపోవునపుడు బిచ్చుకత్తెలాగునకను

పింతునేమో అని ఆమె కించపడసాగినది. ఇంతవరకు నిలుపుకున్న ఆత్మ గౌరవాన్ని విడుచుట కామెమనస్సంగీకరించలేదు.

చంద్రనాథ్ రాగానే సరయు కన్నీరు తుడుచుకొని లేచికూర్చున్నది. 'రండి ఈరోజే నేను వెళ్ళేరోజు! అన్నది.

అప్పటికింకా నామె రెప్పలు తడిగానే ఉన్నవి. చంద్రనాథ్ వెనుకవైపుకు చూచుచు కూర్చున్నాడు. సరయు అతని దగ్గరకువెళ్ళి 'ఇవిగో తాళాలు, తీసికోండి. మళ్ళీపెళ్ళి చేసికొనువరకు వీటి నెవరికిని ఇవ్వకండి! అన్నది.

చంద్రనాథ్ బొంగురుపోయిన కంఠస్వరముతో ఎక్కడో ఒకచోటపెట్టు' అన్నాడు.

సరయు చంద్రనాథ్ ముఖముపట్టుకొని తనవైపు త్రిప్పుకొని నవ్వుచు 'మీరు దుఃఖించుచున్నారా!' అని బుజ్జగించినది

ఆమాట చాల శ్రవణకఠోరముగానే ఉన్నది చంద్రనాథ్‌కి. సరయు వెంటనే అతనికన్నీరు తుడుచుచు ప్రేమతో 'గుర్తుతెచ్చుకోండి. ఇంతవరకు మిమ్మల్ని నేనెన్నడును పరిహాసమాడలేదు. అందుచేత తుదిసారిగా ఈ చిన్నపరిహాసము చేసినాను. కోపముచేయకండి.' అన్నది.

కొంచెమాగి మరల 'ఉన్ననగలు - నాసొమ్ములు అన్నిటిని అలమరలో పెట్టి తాళము వేసినాను. ఇదిగో ఇటుచూడండి నావస్తువులేమియు నాశనముకాకుండ చూడండి' అన్నది.

చంద్రనాథ్ దిసగావున్న సరయు చేతికి నాలుగైదు సాదాగాజులు తప్ప మరేమియులేక పోవుటనుగమనించినాడు.

అప్పటికి ఆమె రూపము కంకాళ్ళతో పూర్తిగా నిండిపోయినట్లయినది. కాని అతడేమిచేయగలడు? ఇద్దరికీ రెండువగలు పెట్టుకొమ్మని ఆమె నవమాసించునా? సరయు మొహము చెరగుచుట్టుకొని భర్తకు నమస్కరించినది. అతనిపాదధూళిని తలదాల్చి 'నేనువెళ్ళినందువలన మీరేమియు విచారించవద్దు. ఇందులో మీ ప్రమేయ మేమియు లేదని నేనెరుగుదును' అన్నది.

ఇంతవరకు బిగపట్టుకొని కూర్చున్న చంద్రనాథ్ ఇక ఆగలేకపోయినాడు. అక్కడినుంచి లేచి వెళ్ళినాడు.

చీకటిపడకముందే రైలు బయల్దేరను న్నానకునియు చున్నది. ముసలిగుమాస్తా రెండుబట్టలతో వెళ్ళి బండినాని ప్రక్కన కూర్చున్నాడు. అప్పుడాయనకు సీతకథ జ్ఞాపకము వచ్చినది. ఆయనకన్నులనుండి కన్నీళ్ళు రాలసాగినవి. కన్నీళ్ళు తుడుచుకొనుచు తనలో 'భగవాన్! నేను నౌకరును కనుక నాకీశిక్ష' అనుకున్నాడు.

బయల్దేరేటప్పుడు సరయు హరకాళి మనోభావమును గమనించి పిలిచి నమస్కరించినది. ఆమె పాదధూళిని నొసటకురాసికొన్నది. 'పిన్నీ! నాపెట్టెచూచుకో' అన్నది.

హరకాళికి నోటమాట తోచలేదు. 'ఆఁ వద్దు వద్దు ఉండనీ' అన్నది.

అంతలో పెట్టె తెరువబడింది. హరకాళి అటుచూడకుండ ఆగలేకపోయినది. ఆవిడకందులో ఒకజత మామూలు బట్టలు, రెండు మూడు పుస్తకాలు, ఒక కాగితం చుట్టిన రెండుమూడు పటాలు, ఇంకను ఏవో రెండువస్తువులున్నవి. 'ఇవిగో వున్నవివే' అన్నది సరయు.

హరకాళి మెల్లగా అక్కడినుంచి జారుకున్నది.

సాయంకాలము కాకమునుపే సరయు బండిలోనికెక్కినది. బండివాడు ఎద్దును అదలించినాడు. బండి గబగబనడచుచున్నది. మణిశంకరుడు తనమేడ రెండవ అంతస్తునుండి ఆదృశ్యము నంతనుచూచినాడు. ఈజరిగిన దేమియు అంత మంచిదికాదని ఇప్పుడనిపించినదతనికి.

## ౧౧

మణిశంకర్‌కి ఆరాత్రి నిద్రపట్టనేలేదు. బండిచక్రాల చప్పుడతని చెవులలో రింగురింగు మనుచునే యున్నది. తెల్లగా తెల్లవారకముందే అతడు పక్కవదలి బయటికి వచ్చినాడు. వచ్చుచునే ఎవరో అపరిచితుడు ద్వారమువద్ద కునుకుపాట్లు పడుటనుచూచినాడు. ఆయనదగ్గరకు రాగానే ఆవ్యక్తి లేచినిలుచున్నాడు. ఆయన వెళ్లిపోవుచుండగా వెనుకనుంచి 'మణిశంకర్‌గారిల్లు ఇదేనాండీ!' అని అడిగినాడు.

మణిశంకర్ వెనుకకు తిరిగి 'అవును' అన్నాడు.

'వారెప్పుడు నాకు దొరుకుదురో చెప్పుదురా!'

'నేనే మణిశంకరుని'

అతడు నమస్కరించి 'నేను తమవద్దకే వచ్చినానండీ'

'మణిశంకర్ అతనిని ఆపాదమస్తకము పలుసార్లు చూచి 'నీవు కాశీనుంచి వచ్చితివా!'

'అవునండీ!'

'హరిదయాల్‌గారు పంపేరా!'

'మరే'

మణిశంకర్ చిరునవ్వునవ్వి 'మరినావద్దకు వచ్చితివే. నేనే డబ్బిత్తుననుకున్నావా?'

ఆవ్యక్తి తలనాడించి 'కాదండీ. మీరు డబ్బుదారికే ఏర్పాటు చేయుదురని హరిదయాల్ చెప్పినాడు'.

మణిశంకర్ కనుబొమ్మలు చిట్లించి 'సరేనేనే ఏర్పాటు చేయుదును లోపలికిరా' అన్నాడు.

ఇద్దరును గదిలోనికి వెళ్లి తలుపువేసి కూర్చున్నారు. 'ఈసంగతి అంతయునిజమేనా?' అని మణిశంకరు అడిగినాడు.

'అవునండీ అంతయు యథార్థమే.' అని ప్రమాణముగాకొన్ని జాబులుతీసి యిచ్చినాడు మణిశంకరుడవన్నియు చదివి 'ఇందులో మాకోడలి దోషమేమున్నది?'

'లేదండి ఆమె దోషమేమియులేదు. కాని తల్లిదోషమువలననే ఆమెకూడ దూషితురాలైనది.'

'అట్లయిన స్వయము దోషికాని దానినేల వృథాగా ప్రమాదమునకు గురిచేయుచున్నావే?'

'ఏమిచేయుదును? గత్యంతరములేక డబ్బుకోసమై ఏమైనను చేయవలసి వచ్చును.'

మణిశంకర్ కొంచెముసేపాలోచించి 'చూడు, ఈఅపవాదు పదిమందికి తెలిసినచో నేను సిగ్గుపడవలసి వచ్చును. మరి చంద్రనాథ్ నాఅన్నకొడుకేకదా!' అన్నాడు

రాఖాల్ తలాడించి 'నేనేమిచేయగలను? వేరేమార్గముకనపడలేదు' అన్నాడు.

'ఆసంగతి నీవాలకమే చెప్పుచున్నది. మరినేనే నీకు డబ్బిచ్చెదననుకో నీఉద్దేశ్యము?'

'ఊఁ. నాకదిమరీమంచిది. నేనిక చంద్రనాథ్‌గారి వద్దకు వెళ్ళవలసిన అవసరమే ఉండదు.'

'మరి డబ్బుముట్టగానే నీవీసంగతి వెల్లడిచేయకుండ ఊరువిడిచి వెళ్ళుట నిశ్చయమేనా?'

'ఓఁ. నిశ్చయమే.'

'ఎంత డబ్బు కావాలి?'

'కనీసము రెండువేలు రూపాయిలు.'

మణిశంకర్ బయటికివెళ్ళి గుమాస్తా లక్ష్మీనారాయణునుపిల్చి ఏమోచెప్పినాడు. తరువాత ఆయనలోపలికివచ్చి పెట్టె తెరచి రెండు వెయ్యిరూపాయల నోట్లుతీసి, రాఖాల్‌కిచ్చి 'ఇదిగో ఇక్కడికి 20 మైళ్ళలో గవర్నమెంటు ట్రెజరీఉన్నది. అక్కడికిపోయి వీటినిమార్చుకో. ఇంకెక్కడను ఇవిమారవు. ఇంకెప్పుడును ఇటువైపుకురావద్దు- పొరపాటునవచ్చితివా ఇక ప్రాణాలతో వెళ్ళవు. జాగ్రత్త, గుర్తుంచుకో.' అని చెప్పినాడు.

రాఖాల్‌దాసు వెళ్లిపోయినాడు. హుటాహుటిగా నడచి పగలు మూడుజాములకు పట్టణము చేరుకున్నాడు. అప్పటికి లైమైనమూలాన ట్రెజరీమూసివేయబడినది. ఆమర్నాడు సరియైన వేళలో షరాబునకు నోట్లందించి చిల్లర నోట్లిమ్మన్నాడు.

షరాబు రెండునోట్లుపరిశీలించిచూచిఅతనినికూర్చుండమని చెప్పి బయటికివెళ్ళినాడు.పోలీసుఇన్‌స్పెక్టరుతోతిరిగివచ్చి రాఖాలునుచూపించి 'ఇతనివద్ద దొంగనోట్లున్నవి. జమీందారు మణిశంకర్‌గారింటికితడు నిన్నప్రొద్దున్నే బిచ్చానికని

వచ్చి ఈ రెండునోట్లు ఎత్తుకొనిపోయెనని వారిమనిషి చెప్పు చున్నాడు. ఈనోట్లనెంబర్లు టాలీ అయినవి' అన్నాడు.

'నాకీనోట్లను మణిశంకర్ స్వయముగానే ఇచ్చాడండీ' అన్నాడు రాఖాల్.

'సరే ఈసంగతి కోర్టులో చెప్పుకో' అన్నాడు వరాబు.

రాఖాల్ 'ఈనోట్లెవరివో వారినే అడిగినచో నిజము తెలియును.' అని కోర్టువారితో చెప్పుకున్నాడు.

వాయిదానాటికి మణిశంకర్ కోర్టుకువచ్చి ప్రమాణముచేసి నేనీ మనిషి నిదివరకెన్నడును నాజీవితములో నే చూడలేదు. ఈనోట్లు రెండును నాపెట్టెలోనె పెట్టినాను. నేనెరికిని ఇయ్యలేదు.' అన్నాడు.

రాఖాల్ ఆత్మరక్షణకై యెన్నో చెప్పవలెనను కున్నాడు. వాటిలో కొన్నిటిని గుమాస్తా వ్రాసికొన్నాడు. కొన్నిటిని మణిశంకర్ తరఫు ప్లీడర్ క్రాస్ చేసి ఎగురగొట్టి పార వేసినాడు. చివరికి ఫలితముగా రాఖాలుమాటల నెవరును నమ్మలేదు. మేజిస్ట్రేటుగారు రాఖాలుకి రెండేళ్ళు కఠినశిక్ష విధించినారు.

## ౧౨

సరయు వెళ్ళేసరికి పండాగారింట్లో ప్రాతదాసి ఎక్కడికో పోయినది. వంటలక్క, సులోచనలయిపు లేకుండ పోయినది. ఇల్లు నిర్జనారణ్యముగానున్నది. ఆమెతో కూడవచ్చిన గుమాస్తా కంటతడి పెట్టుకొనుచు 'ఇంకవెళ్ళనా అమ్మాయీ' అన్నాడు.

సరయు నమస్కరించ గలిగినదేకాని మాట్లాడలేక పోయినది. ఆమెమాట నందుకో కుండగనే గుమాస్తా వెళ్ళి పోయినాడు. పాపము! అతడేమి చేయుగలడు?

హరిదయాలు సాయంకాలమున ఇంటికివచ్చినాడు. వరండాలో కూర్చుండి యున్న సరయునుచూచి 'ఎవరువారు' అని ప్రశ్నించినాడు.

సరయులేచి దండముపెట్టి 'నేనండీ!' అన్నది.

'సరయూ?'

పండా ఆమె ఒంటిమీద ఒక్కనగైనా లేకపోవుట గమనించినాడు. కట్టుకున్నదికూడ సాదాచీరయే. నౌకరు-చాకరు ప్రక్కనలేరు. విషయమంతయు అవగతమైనది. 'నే ననుకున్నట్లే జరిగినది. మీభర్తగారు వెళ్ళగొట్టిరా?' అని వేళాకోళముగా అడిగినాడు.

సరయు జవాబు చెప్పలేకపోయినది.

పండా కఠినముగా 'ఇంకనీవిక్కడ నుండుటకు వీలు లేదు. ఒకసారి చేరదీసి బుద్ధి తెచ్చుకున్నాను. చాలు చాలు ఇంకవద్దు' అన్నాడు.

సరయు తలవంచుకొనియే 'మాఅమ్మఎక్కడ?' అని అడిగినది.

'ఆమె ఎక్కడికో పారిపోయినది. నన్నిట్లు నడిగుండా న పారవేసి జారుకున్నది. తనగుణముపోనిచ్చుకున్నదికాదు.

కోపముతో పండామండిపడుచున్నాడు. చమత్కారముగా ఇట్లా అన్నాడు 'ఆవిడగా రెక్కడో దర్జాగానే ఉండవచ్చు' నన్నాడు.

సరయు అక్కడనే కూలబడినది. ఆమె తల్లికోసమే వచ్చినదాయె.

'నిన్నింకను నాయింటిలో ఉంచి నాజాతి దగ్ధముచేసికో లేను. అంతప్రేమతో పెంపొందినవాడే నీకు చిన్నగుడిసె అయినను వేయించలేకపోయినాడే. నాకేమిపట్టినది? ఇంకపో' అన్నాడు నిర్దాక్షిణ్యముగా.

సరయు బావురుమని 'బాబా! అమ్మలేదాయె. నేనె క్కడికని వెళ్ళను?'

ఆమెయెంతదీనముగాఏడ్చిననుహరిదయాలుహృదయం కరగాడిస్థితిలోలేదు. అందేకోశాన మనుకారములేదు. 'కాశీ అంతటి పట్టణములో నీవంటిదానికి చోటేదొరకదా? నీకు వీలైనచోట ఉండు' అని స్పష్టముగా చెప్పివేసినాడు.

అప్పటికి ఉడికిఉన్న మూలాన పండా నిక్కచ్చిగా అనగలిగినాడు.

'నాభర్తయే నన్ను వెళ్ళగొట్టినప్పుడు మధ్య ఈయన నన్నెట్లు ఇంట్లో ఉంచుకొనును? ఇందుకై ఆయనను పల్లెత్తు మాట అనకూడదు' అనుకున్నది సరయు. అయిన ఇప్పుడు కర్తవ్యము? తాను నిలబడుటకైనను చోటులేదు. ఏదోకొన్నా ళ్ళపాటు తనభర్త యింటి కతిథిగావెళ్లి యిప్పుడు తిరిగివచ్చి నది. ఆయన యీమెనూ టేమెత్తరు. ఇప్పుడామెకేమనోబాధ యెక్కువైనది. మాట్లాడకుండ కన్నులనీరు కార్చుచున్నది. పదారేళ్లు నిండీ నిండకుండగనే ఆమె కచ్చటలు-ముచ్చటలు పూర్తిఅయినవి. తల్లిలేదు, తండ్రిలేనేలేడు, భర్తవదలినాడు. నిలుచుటకు సైతము చోటులేదు. పైగా మచ్చదిగపడినది.

రూపము—పసుచుదనము నున్నది. వాటితో బ్రతుకవచ్చును. కాని ఆమెదృష్టి తత్త్వముకాదు. ఇంకను ఎన్నాళ్లు ఇట్లు జీవించవలెనని యాలోచించినది. బాల్యమున ఎన్నోకష్టా లనుభవించినను మధ్య కాలమున సుఖపడిన మూలాన ఇదొక నూతనవిధమువలె నున్నదామెకు. కాని ఇంతఅవమానాన్ని ఆమె యింతకుముందెన్నడు ననుభవించలేదు.

పండా కిదంతయు నెందుకు? కోపముతో 'ఇంకనుకూర్చున్నావేమి?' అని గద్దించినాడు.

సరయు చకితురాలై 'ఎక్కడికి వెళ్ళను?' అన్నది.

'నేనేమెరుగుదును?'

బొంగురు స్వరముతో 'బాబా! ఈరాత్రికి ...'

'ఏమీవీలులేదు. నిన్నిక్కడ క్షణమైన నుండనియ్యలేను.' అన్నాడు.

సరయు లేచి నిలుచబడినది. ఆమె కేదో ధైర్యమువచ్చినది. ఎన్ని అపరాధములు చేసినను క్షమాపణ కోరదగినవారినే కోరనప్పుడీయన నెందుకడుగవలె? ఏదేమైనను గంగ యింకను ఇంకిపోలేదుకదా? గంగాదేవికి సమాజభయములేదు. దానికిజాతియుపోదు. ఎంతపాపాత్మురాలినైనను సాధారణంగా నొడిలోనికి తీసికొగలదు. ఎక్కడను ఆశ్రయము దొరుకక పోయినను అక్కడదొరికితీరును.' అనుకొన్నది తనలోసరయు.

వెళ్ళదలచుకునే వెళ్ళలేకపోయినది. మరల కూర్చున్నది.

హరిదమాలు తన జీవితమున నింత మొండివారిని చూడలేదనుకున్నాడు. ఒకమూల గొంతుక ఎండుచున్నది.

అయినను గట్టిగా మాట్లాడకుండ జరుగదని 'నిశ్చయించుకొని' నిశ్చయించుకొని కాని పోవా? ఏమి? పో పో.' అని గట్టిగా అరచినాడు.

అంతలో ఎవరో బయటనుండి పారిదయాళువు పిలిచినాడు. ఆయన అట్లట్లుయినాడు. కైలాసు ఒకచేతితో చదరంగపుబరిణ, రెండవచేతితో హుక్కా పుచ్చుకొని లోనికి వచ్చినాడు. అతడు చాలసేపునుండి బయటనుండియే ఈ ఘర్షణవిన్నాడు. అందుకనే లోపలికిరాగానే చదరంగపుబరిణ, హుక్కాగొట్టము ఉన్నను ఆయన మొఖములో నవ్వులేదు. సరాసరి సరయు వద్దకువెళ్లి, 'సరయూ! ఎప్పుడు వచ్చితివమ్మా?' అన్నాడు.

కైలాసు ఆమెనుదీవించి 'రా అమ్మా! నను. నీవు మాయింటికి రాక ఇక్కడి కెందుకువచ్చితివమ్మా!' అనుచు హుక్కాక్రింద పెట్టినాడు సరయు పెట్టెను తీసికొని చంకను పెట్టుకొని 'రా అమ్మా! చీకటిపడుచున్నది వెళ్ళెదము పద!' అన్నాడు.

కైలాసు ఆమెను తీసికొనివెళ్ళుటకేవచ్చినట్లుఅన్నాడు సరయు కదేమోబోధకాలేదు. మొదలకుండ కూర్చొనియున్నది.

కైలాసు మరల ఏమి అమ్మాయీ! ఈముసలితాత యింటికి వచ్చుటకుకూడ సిగ్గెందుకమ్మా? నాయింట్లోనున్న నిన్నెవరు ననుమానించలేరు. తాత మనుమరాలు ఇద్దరమును హాయిగా ఉందము. పద ఆలస్యముచేయకు' అన్నాడు.

కాని సరయు లేవలేదు.

పండాగట్టిగా 'బాబాయ్! ఏమిటిది' అని అరచినాడు.

'ఆఁ ఏమి యునులేదు' అని కైలాసు సరయు చేతిని పట్టుకొనబోవునట్లుగా దగ్గరగా వెళ్లినాడు. 'లేవమ్మాయి! పద. నీవిక్కడ కూర్చుని సూటిపోటి మాటలు పడనేల? అన్నాడు.

సరయు లేచినది. అదిచూచి హరిదయాలు 'బాబాయ్ మీరీమెను మీయింటికి తీసికొని వెళ్లుదురా? అని అడిగినాడు.

'లేదు నడిబజారు వదలుటకై తీసికొని వెళ్ళుచుంటి నిలే' అన్నాడు.

వ్యంగమైన ఆమాటవిని హరిదయాలు కోపముతో 'బాబాయ్! మీరుచేయునది మంచిపనికాదు. తరువాత సంగతి ఆలోచించుకొని మరీచేయుండి' అన్నాడు.

అతనికి బదులుచెప్పకయే కైలాసు అమ్మాయీ నడు. ఇతడింక నేమేమనునో' అన్నాడు.

సరయు బయటికి వచ్చినది. కైలాస్ చంకలో పెట్టె పెట్టుకొని ఆమెవెనుకనే వచ్చినాడు. వెనుకనుండి హరిదయాల్ 'బాబాయ్! మీరుకూడ జాతిభ్రష్టులగుదురా? అని అరచినాడు. కైలాస్ పలుకలేదు.

'అట్లయిన యీనాటినుండి మనకిద్దరికిని భోజనములు లేనట్లేనా?'

ఇప్పుడు కైలాస్ వెనుకకుతిరిగి నిలబడి 'నేనుపిలువకుండ అందరియిళ్ళకువెళ్లి భోజనాలు చేయుచుంటినా?' అన్నాడు.

'కాకపోయినను హెచ్చరించుచున్నాను.'

కైలాస్ కోపముతో కనుబొమ్మలు చిట్లించినాడు. ఇన్నాళ్ళనుండి కాశీలో ఉన్నను ఆయనముఖమున కోపమింతవరకు నెవరును చూడలేదు. ఇప్పుడిక కోపముతో 'హరి దయాల్ నేను పండానుగాను. యాత్రికుల దయనాకక్కర లేదు. నాకు తోచిన మంచిపనినే యిన్నాళ్ళనుంచి చేసితిని. ఇప్పుడునుఅంతే, ఇప్పుడు నన్నుగురించి నీవేమియు విచారించ నక్కరలేదు అన్నాడు.

హరిదయాలు సిగ్గుపడి నేను మీమేలుకోరియే చెప్పు చున్నాను అనుచుండగనే మధ్యలో అందుకొని 'ఆఁ ఆఁ వద్దువద్దు. నీసలహా లేకుండగనే నాకేబదారేళ్లు గడువగా ఇక మిగిలిన నాలుగురోజులు మాత్రము గడువవా!'

పండా ఆగినాడు.

కైలాసు తనయింటికి వెళ్ళగానే పెట్టెక్రిందకు దింపుచు, సహజమైనప్రేమతో 'అమ్మాయి' ఈయిల్లు – వాకిలి అంతయు నీదే. ఇంతకన్నా నీతో ఇప్పుడు చెప్పవలసినదేమి యును లేదు. ఇక నీవే యిల్లుసవరించుకోవలెను. మధ్యలో కొంచెమీవృద్ధుని యోగక్షేమములు చూచుచుండు అంతే, అన్నాడు.

ఇంక కైలాసుకి చెప్పవలసిన దేమైననున్నదోలేదో తెలియదుకాని, సరయుమాత్రము చాలసేపటివరకు కన్నీళ్ళు తుడుచుకొనుచునే ఆలోచించి ఇకతాను చెప్పవలసిన దేమియు లేదనుకొన్నది. ఆమెకొక అండదొరికినది.

## ౧౩

చంద్రనాథ్‌కి మేలుకొనియే రాత్రి గడిచేది. ఆశరత్కాలములో వేకువవేళ వీచెడి చల్లని పిల్లగాలులు తగిలెడి వరకు నిద్రపట్టేదికాదు. సూర్యుడు తనకిరణాలను పంపి లేపు వరకు లేచెడివాడునుకాదు. అయినను నిద్రమొగము తగ్గెడిది కాదు. పగలు పనియునులేదు, ఏసంతోష విశాసములును లేవు. విచారమసలేలేదు. అట్టి యుదాసీనావస్థలో అతనిదైనందినచర్య నడచుచున్నది. నిండుగా సరుకువేసికొన్న నావనిండుప్రవాహములో ప్రవాహమువలె మెల్లగాతిరుగుచు పోవునట్లుగా అతని జీవితనౌక నడచుచున్నది. తనచుట్టును క్రమ్మియున్న కారుమబ్బులు తన జీవితములో సుఖసూర్యుని కన్పడనియ్యవని అతడనుకొన్నాడు. నిర్జనముగా, నిశ్శబ్దముగా నున్న తనగదిలోన దినమునకు నిరాశాఛాయలు దట్టము కాజొచ్చినవి. చంద్రనాథ్ అందులోనే ఉండిబడలికతో సగము మూసికొన్న కన్నులతో చూచుచు, కాలముగడుపుచున్నాడు.

ఆ అశ్వయుజమాసములో చంద్రనాథునితో నతని వివాహము జరుగునని హరకాళి చెప్పుచువచ్చినది. కాని చంద్రనాథ్ మౌనముగానే ఉన్నాడు. ఆమౌనమంగీకార సూచకమో, అనంగీకార సూచకమో తెలియక భర్తతో వివరించెడిది. మణిశంకర్‌ని ఎవరైనను ఆవిషయమడిగినచో చంద్రనాథ్‌ని అడిగినగాని నిశ్చయము చెప్పలేననెడివాడు.

కార్తీకమాసములో దుర్గాపూజ వచ్చును. మణిశంకరుని వాకిట్లోనుండి రాబోవు నుత్సవములను సూచించుచు

సన్నాయిచప్పుడు వినవచ్చుచున్నది. చంద్రనాథునికి మెలకువవచ్చినను, నిద్రబద్ధకము వదలనందున, పక్కమీదనుండి లేవకయే వినెడివాడు కాని అతనికి దానివలన ఆనందము కలుగకపోగా విచారమే కలిగెడిది. ఇక నక్కడనిల్చుట దుర్భరమనిపించిన దతనికి. నౌకరునుపిలిచి సామానులుసర్దమన్నాడు. ఆనాడే అలహాబాదు వెళ్ళదలచినాడు.

ఆసంగతి వినగానే హరకాళి పరుగెత్తుకొని వచ్చినది. వ్రజకిశోరుడుకూడ వచ్చి వెళ్ళవలదని చెప్పినాడు. మణిశంకరుడు స్వయముగావచ్చి ఈపట్టినాడు వెళ్ళవలదని బతిమాలినాడు. కాని చంద్రనాథ్ ఎవరిమాటను వినలేదు.

మధ్యాహ్నము వేళ హరిబాల వచ్చినది. సరయు వెళ్లినాక ఆమె వచ్చుటలేదు. ఆమెను చూడగానే చంద్రనాథ్ 'అవ్వా! ఈవేళ హఠాత్తుగా వచ్చితివేమి?' అని అడిగినాడు.

ఆమె అతనిమాటకు బదులుచెప్పకయే 'నీవెక్కడికో ప్రయాణమగు చుంటివట!' అన్నది.

'అవును'

'పడమటకేనా?'

'అవును'

హరిబాల ఆలోచించి మెల్లగా 'ఇంకెక్కడికైనను వెళ్లెదవా?' అన్నది.

అతడు గ్రహించి 'లేద'నిచెప్పి పరధ్యానముగా పచారుచేయసాగినాడు.

హరిబాల చెప్పదలచుకొన్న విషయమును చెప్పుటకు సిగ్గుపడుచున్నది. కొంతసేపటికెట్లో ధైర్యము కల్గించుకొని 'ఏమినాయనా! నీవందు కేమియు నుపాయము చూడలేదు కదా!' అన్నది.

హరిబాల వచ్చినప్పటినుండి చంద్రనాథ్ మనసులో సరయు మెదలుచున్నది. ఇద్దరు నామెవిషయమే ఆలోచించు చున్నారు. అందుచే ఆమాట అనుసరికిద్దరికిని కన్నులనీరు క్రమ్మినది. చంద్రనాథుడు తనకుతానే సంబాళించుకొని ప్రక్కకుచూచుచు 'ఏమిచేయనో చెప్పుఅవ్వా!' అన్నాడు.

'ఆమె కాశీలో ఎక్కడ ఉన్నదో?'

'తల్లివద్దనే ఉన్నదనుకుందును!

'ఉండును కాని ...'

'కాని ... ఏమిటి?'

హరిబాల కొంచెము సేపూరకుండి 'నాయనా! నీవు కోపపడకు ...'

చంద్రనాథ్ నిశ్చలముగా ఆమెవంకకే చూచుచు న్నాడు. హరిబాల మెల్లగా 'నాయనా; ఆమెకు డబ్బుపం పించు ఇప్పుడొంటరిదే కాని, మరి నాలుగురోజులు పోయి నచో ...'

చంద్రనాథ్‌కీ విషయము తెలియును కాని తెలియ నట్లుగా 'ఊఁ నాలుగుపోయిన ... ఏమిటి?' అన్నాడు.

హరిబాల కన్నీరు తుడుచుకొనుచు 'భగవంతుని దయ వలన ఆమె కడుపులోని బిడ్డ బ్రతికియున్నచో ... మరి'

చంద్రనాథ్ నఖశిఖపర్యంతము వణికినాడు. 'అవ్వా! ఇవ్వేళషష్టికదా?' అన్నాడు తటాలున.

'అవును నాయనా:'

'మరి ఈ వేళ...'

'వెళ్ళనా?'

'అదే ఆలోచించుచున్నాను.'

'సరే అట్లేచేయుము. మాజలయునతర్వాత నీయిష్టమువచ్చినపోటుకు వెళ్ళు. ఈనాల్గురోజులు మాత్రమింటివద్ద నే ఉండు' మన్నది.

ఏమనుకొన్నాడో చంద్రనాథ్ అట్లేచేయుటకొప్పుకొన్నాడు.

విజయదశమి వెళ్ళినది. ఒకనాడు చంద్రనాథ్ గుమాస్తానుపిలిచి 'మీరామెను కాశీలో విడిచినప్పుడు హరిదయాల్ తో ఏమైనను చెప్పివచ్చితిరా?'

'నాకాయన కన్పించనేలేదండీ'.

చంద్రనాథ్ కొంచెము భయపడినట్లయి 'కన్పించనే లేదా? మరిఆమె నెవరిదగ్గర వదిలినారు? ఆమె తల్లినైనను కలిసికొన్నారా?'

గుమాస్తా తలనూపుచు 'లేదండి. అప్పుడింటిలో నెవరును లేరండీ!' అన్నాడు.

'ఎవరునులేరా? ఆయింటిలో ఎవరు నివసించుచున్నారో తెలిసికోలేదా? హరిదయాల్ మరొక యింటికి మారినాడేమో?'

'ఆహాం హరిదయాల్ ఆయింటిలోనే ఉన్నారటండీ.'

చంద్రనాథుడు కొంచెముసేపుండి నిట్టూర్చి 'మరి ఇప్పటికెంత డబ్బు పంపించినారు?' అని అడిగినాడు.

'అబ్బే. ఏమియూ పంపలేదండీ!

చంద్రనాథ్‌కి ఆశ్చర్యము, విచారము ఒక్కసారిగా కలిగినది. విచారముతో దీనుడై 'ఏమీ! ఏమియుపంపనేలేదా? ఎందుచేత?' అన్నాడు.

గుమాస్తా సిగ్గుతో 'పెద్దమ్మగారు నెలకో అయిదు రూపాయలు పంపినచాలు నన్నారండీ!' అన్నాడు.

అది వినుసరికి చంద్రనాథ్‌కి ఒళ్లుమండినది. నెలకైదు రూపాయలేమిటి? ఈసొమ్ము అత్తదాఏమిటి? ఇకపైనుండి మీరు నెలకైదువందలు పంపండి' అన్నాడు.

'చిత్తం' అని గుమాస్తా తెల్లపోయి వెళ్ళినాడు.

ఈసంగతి వినపడగానే హరకాళి కళ్లు మొగమంత లుగా చేసికొనుచు 'వాడు పిచ్చివాడైపోయినాడు' అన్నది. గుమాస్తాకేసి పెద్దగానవ్వినది ముసలిగుమాస్తా ఆనవ్వులోని భావమును గ్రహించినాడు. హరకాళి ఎంతడబ్బు పంపు మన్నాడు' అని అడిగినది.

'నెలకైదొందలు'.

మళ్ళీనవ్వినది. అదివిని గుమాస్తా విచారించినాడు. చాలాసేపునవ్వి ఆఖరుకి ఆమె ఇట్లన్నది 'మావానికి కోపము వచ్చినచో ముందువెనుకలు చూడడు. పాపము! ఆదౌర్భా గ్యురాలి అదృష్టమంతే, నేను నెలకైదు రూపాయలు పంపు మన్నానుకదా! అదికూడ ఎందుకు పంపవలెనని కోపమువచ్చి నది. అయిదుకాక పోయిన అయిదువందలు పంపవయ్యా!

అని అన్నాడు. అంతేకాని అసలు పంపుటయే మావాని కిష్టములేదు. తెలిసినదా! అన్నది.

గుమాస్తాకు బుర్రలేదు. మొదట్లో ఆమె చెప్పెడిది కూడ అర్థముకాలేదు. కాని ఆలోచించగా, ఆలోచించగా ఆమెచెప్పినదే నిజమనిపించినదతనికి కాక ఇంటినుండి వెళ్ళగొట్టిన దానికెవరైన అంతడబ్బు పంపుదురా! గుమాస్తా క్రిందపైనచూచి 'అమ్మా! తమరు చెప్పినట్లే చేయుదునమ్మా! అన్నాడు.

'నేను చెప్పవలెనా? ఈపాటిది నీకు తెలియదా? అన్నది.

గుమాస్తా తెల్లబోయి 'అట్లేచేయుదునండి' అన్నాడు.

'కాదుకాదు మీరామెకు నెలకైదురూపాయలు పంపండి. అది చంద్రనాథ్ ఇయ్యనిచో నా ఖాతాలోనుండి యైనను పంపండి. అన్నది ఉదారముగా.

హరకాళికి ప్రతినెలలోను చేతిఖర్చుకని అయిదు రూపాయలిచ్చుచుండెడివారు.

'అట్లేనండి' అన్నాడు గుమాస్తా.

చంద్రనాథ్ అలహాబాదు వెళ్ళినాడు. ఆయనకు జాబు వ్రాసి కనుక్కొందమను కొన్నాడు. కాని ఇట్టివిషయమున జాబువ్రాసికూడ తన తెలివితక్కువతనమును వ్యక్తపరచు కొనదలచుకొనలేదు. అట్లు ఊరకొన్నాడు.

## ౧౪

సరయువచ్చి రెండేళ్ళయినది. ఈమధ్యలో కైలాసు జీవితములో చాల పరివర్తన జరిగినది. అతనికొడుకు' కమల చరణ్ కన్నుమూసిననాడే అతనికి ప్రపంచకమంతయు చీకటైనది. ఇప్పుడు సరయు పరివిష్ట మరల అతనిని మరచిన వాత్సల్యమును చవిచూపినది. చిరకాలమున కిప్పటికతని కన్నులలోనికి మరల ఆనందాశ్రువులు వచ్చినవి. కన్నులు తుడుచుకొనుచు 'మనయింటికి మరల విశ్వేశుడు వచ్చినాడు' అన్నాడావృద్ధు. ఆబాలుడు పసివాడు పిలిచినదో బదులు పలుకలేదుకాని ఎవరైనను 'విశ్వా!' అన్నచో చూచుచుండును. క్రమేణ పెరుగుచు పాలకంటె నీరే రుచియైనదని తెలిసికొని మంచి – చెడ్డలతో నిమిత్తములేకుండ ఏ చెంబులోని నీటితోనైనను దాహము తీర్చుకొనునప్పుడు పుట్టుక, ముఖమునకు మసిపూసికొని వింతయందమును కల్పించుకొనునప్పుడే ఆపసివాడు సరయును వదలి కైలాసు ఒడిలోనికి చేర సాగినాడు.

తెల్లవారగానే కైలాసు 'విశ్వా!' అని పిల్చువాడే. విశ్వము 'తాతా!' అని పలికెడివాడు. 'రారా బాబూ! శంభుమిశ్రాను ఒక్క-పండెమోడించి వత్తమురా' అనెడివాడు కైలాసు. వెంటనే విశ్వము చదరంగపు బరిణ చేతబట్టి ముద్దువచ్చునట్లు 'పత' అనుచు రెండుచేతులు సాచి తాతమెడకు చుట్టుకొనెడివాడు. అప్పుడు కైలాసు అపరిమితానందభరితుడగువాడు. అతడుసరయునుపిలిచి' అమ్మాయీ! మనవిశ్వం

మంచి ఆటగాడగునమ్మా! 'అనువాడు. సరయు నవ్వేడిది. విశ్వం తాతచంక నెక్కి చదరంగపు సామానుతో ఆటకై బయటకు వెళ్లినాడు. దారిలో ఎవరైనను కనపడి 'బాబాయి ముసలితనములో మీకు మరొక రెండుచేతులు వచ్చినవే!' అని పరిహాసము చేసినచో, అతడు నవ్వి 'అవునుమరి ఇప్పుడు నాచేతులలో ఓపికలేదుగదా! అందుకని ఈలోక వృక్షమునుండి క్రిందికి పడిపోకుండ ఈక్రొత్తచేతులు వచ్చిన వనెడివాడు. 'అమ్మో! ఈముసలివానిని మాటలలో ఓడించ లేము' అనుచు ఎదుటివాడు వెళ్లిపోవువాడు.

శంభుమిశ్రాయింటిలో చదరంగమాడుచోట విశ్వేశ్వరునికొక ప్రత్యేకస్థానమున్నది. ఆబాలుడుతాతగారి యొడిలో కూర్చుండి ఎర్రబరిణను కదపుచు, గంభీరము చూచుచుండువాడు. 'అవసరమైనచో తానుకూడ ఒకయెత్తు వేయుదు'నన్నట్లుగా.

తాతగారి దంతపుపావులు చంపబడినప్పుడు వాటిని పొట్టమువేసి నొక్కుకునెడివాడు. ఎప్పుడు ఎర్రని మంత్రి మీదనే ఉండెడిదతనిదృష్టి. అది చేతికివచ్చెడివరకు దీక్షగా చూచెడివాడు. మధ్యమధ్య 'తాతా! అది' అనిదానికేసి చూపెడివాడు. తాత ఆటధ్యాసలో ఉండి 'ఆగునాన్నా!' అనువాడు. కుర్రవాడెటైనను వెళ్లినచో తాతగారు కొంత సేపాటమీద, కొంతసేపు పిల్లవానిమీద దృష్టిపెట్టి చలించువాడు. అప్పటికప్పుడే రెండుమూడు పావులు పోయెడివి. కైలాసు వెనుకకు తిరిగి 'రానాన్నా! చూడు! మనమోడిపోవుచున్నాము. రావలె పరుగెత్తుకొని రావలెను' అని కేక

వేయువాడు. విశ్వం ఒక్క-పగుగులోవచ్చి తన చోటులో కూర్చుండువాడు. అప్పుడు రెట్టించిన ఉత్సాహముతో ఆడు వాడు కైలాసు. ఆట పూర్తియైనాక విశ్వం తనకిష్టమైన ఎర్ర మంత్రిని పుచ్చుకొని తాత చంకెక్కి ఇంటికి వచ్చెడివాడు.

ఈరీతిగా క్రొత్త ఆనందముతో కైలాసుకి రోజులు నడచుచున్నవి. ప్రాత నియమములు సడలినవి. వెనుకటివలె చదరంగపు బరిణకు తాకిడిలేదు. అదెప్పుడు చూచినను మూలనే పడియుండెడిది. కైలాసు ఉదయమునశంభుమిశ్రాను, మధ్యాహ్నము గంగాపాండేతోను ఆడుటలేదు. ముకుంద ఘోషు ఇంటిసావడిలో సాయంకాలము వేళల నల్గురును కలి యుటలేదు. ముకుందఘోషు తెగపిలిచి విసుగుచెందుటయే కాని, కైలాసు రాత్రివేళలకూడ అతనిని కలియలేకపోవు చున్నాడు. అతడు దీపముముందు కూర్చుండి క్రొత్తశిష్యు నికి చదరంగపుటాట నేర్పుచున్నాడు.

విశ్వం 'గుల్లం' అనెడివాడు.

'అవును. అదిగుర్రమే!

'గుల్లం నలుత్తుందా?'

'అవును గుర్రము ముందుకి రెండడుగులువేసి, ప్రక్క కొకఅడుగు వేయును.'

విశ్వం పెద్దగాఆలోచించి' బండిలాగుతుందా!' అనే వాడు.

'ఈ గుర్రము బండిలాగదు నాన్నా. బండిలాగెడి గుర్రము మరొకటి.'

అట్లువారు మాట్లాడు కొనునప్పుడు సరయు దగ్గరలో ఉండి విన్నచో తన కొడుకు వచ్చీరాని మాటలకు, తెలివి తేటలకు సంతోషముతో నోటికి పైటకొంగు అడ్డముపెట్టు కొని నవ్వుకునెడిది.

విశ్వం తన చిరుప్రేలితో చూపుచు 'అది' అని మంత్రిని తన కిమ్మని అడిగెడివాడు. ఆముసలాయనకు అన్నియు ఉండగా బాలుని దృష్టి మంత్రిమీదనే యెందుకు పడునో తెలిసెడిదికాదు. మరపించవలెనని మరొకబంటుపిక్క లిచ్చెడివాడు. కాని ఆబాలుడంతటితో మరచెడి రకముకాదు. చివరికి తప్పక మంత్రినే యిచ్చి 'నాన్నా! ఇది పోగొట్ట కేమి?' అనెడివాడు.

'ఏమి?'

మంత్రిపోయినచో ఇక ఆటే మున్నది?'

'ఆతజలగదా!'

'జరగదుబాబూ! ఆడుటకే వీలుండదు.'

విశ్వం 'మంత్రిలా!'

'అవును మంత్రికే' అనివచ్చు చెప్పువాడు.

ఒకనాడు భోలానాథ్ ఇంటిలో పురాణము చెప్పు చున్నారు. కైలాసు విశ్వమును చంకపెట్టుకొని కథవినుటకై వెళ్లినాడు. జడభరతునికథ చెప్పుచున్నారు. కరుణారస ముట్టిపడునట్లు చెప్పుచున్నారు. మహర్షికి లేడిపిల్ల దొరికినది. అదిపుట్టుట, మహర్షి నాశ్రయించుట, జడభరతుడు అనిరాశ్రయజంతువున కాశ్రయమిచ్చుట, చక్కగా వర్ణింపబడు చున్నది. ఇంతలో విశ్వం క్రిందికిజారి వేరేకూర్చున్నాడు.

కానికయిలాసు వానిని దగ్గరగా తీసికొని ఒడిలోనికి తీసికొని కూర్చున్నాడు.

తరువాత క్రమేణ ఆలేడిపిల్ల ఆమహర్షిలో వాత్సల్య మునెట్లు పెంపొందించినదో, తుత్తునియలైన మమకారము నెట్లు తిరిగికల్పించినదో, ఆయనకు సర్వదానిత్యకర్మానుష్ఠాన ములో, జపతపములలోకూడ నెట్లు స్థానము నాక్రమించినదో వర్ణించబడినది. ధ్యానించునప్పుడు మహర్షికానిరా క్రియ జంతువు యొక్కదయనీయస్థితియే కన్పడసాగినది.

అది క్రమేపి పెరిగి పెద్దదైనది. యిచ్చవచ్చినట్లుతిరుగ సాగినది. క్రమముగా దూరప్రదేశాలకు వెళ్ళసాగినది. అది తిరిగివచ్చు వేళదాటినచో 'రా, రా, రా!' అని కేకలు వేసి పిల్చువాడు. కొన్నాళ్ళకది బంధములను త్రెంపుకొనియెట్లు అడవిలోనికి వెళ్లిపోయినదో చెప్పుచుండగా, శ్రోతలకు కన్నీ రుకాల్వలైనది. అడవిమృగమడవిలోనికి వెళ్లిపోయినదే కాని మహర్షి హృదయాంత రాంతములోని బాధను గ్రహింప దాయె. జడభరతుడు 'రా, రా, రా' అని పిల్చెను. కాని అదితిరిగిరాలేదు. ఆదీనమైన పిలుపునకు బదులు పలుకనేలేదు. అతడడవినంతనుగాలించి, చెట్టు-పుట్ట వెదకి 'రా, రా!' అని కంఠమెత్తి ఎంతగాపిల్చినను రాలేదు. ఒకటి, రెండు, మూడు రోజులు గడచినవి. కాని అదిరాలేదు. ఆయనపూజా - పుర స్కారాలు తిండితిప్పలుమాని ఆధ్యానముతోనే అడవిలో తిరుగాడసాగినాడు.

నేలమీదపడి పోయినాడు. మృత్యువు వచ్చినది. గొంతుక బద్ధమైనది. పెదవులు మెదలుచున్నవి. ఇంకను 'రా, రా, రా' అనుచున్నట్లే యున్నది.

పురాణ పఠనము ముగిసినది. కైలాసు విశ్వమును గట్టిగా గుండెలకు హత్తుకొని ఏడువసాగినాడు. అతని మనస్సెంతో కదలినది. అతనుకూడ 'రా, రా, రా' అని పిలువసాగినాడు.

ఆ ముసలి యేడుపు ఆ పెద్దపక్షులో నెవరికి నసహజ మనిపించలేదు. కారణమేమనగా: మనుష్యులో పాటుగా ఎవరైన నేదో యొకదానిని కోల్పోవుట సహజమేగదా! అందరి హృదయములును 'రా, రా, రా' అని పిలుచుచున్నట్లే ఉన్నవి.

కైలాసు విశ్వమును చంకనెత్తుకొనుచు 'రా! నాయనా! ప్రొద్దుపోయినది. ఇంటికిపోదము!' అన్నాడు. విశ్వము తాతచంకెక్కి యింటికి వెళ్ళినాడు. రాత్రి చాల ప్రొద్దుపోయినందున దారిలోనే తాతచంకలోనే విశ్వము నిద్రపోయినాడు.

ఇంటికిచేరగానే పిల్లవానిని తల్లికందించుచు 'ఇదుగో నమ్మా నీపిల్లవాడు. నీదగ్గరే పండుకోబెట్టుకో.' అన్నాడు కైలాసు. ఈనాడతని కన్నులేవో విచారముతో బరువుగా నున్నవని ఆమె గ్రహించినది.

## ౧౭

ఈ రెండేళ్ళనుండి చంద్రనాథ్ కింటితో సంబంధము లేదు. అవసరము వచ్చినప్పుడు కాస్త వ్రాసినచో గుమాస్తా

పైకము పంపుచున్నాడు. హరిబాల అప్పుడప్పుడు విచారపూర్వకముగా ఉత్తరము వ్రాయుచుండెను. వ్రజకిశోర్ కూడ ఇంటికిరమ్మని కార్డు వ్రాయుచుండెడివాడు. మహేశశంకర్ కూడ తనశరీరపరిస్థితి బాగాలేదని, ఒక్కసారి చూడవలెనని యున్నదని కార్డులు వ్రాయువాడు. చంద్రనాథునకా జాబులోని సంగతులు నెప్పుడును పట్టించుకోలేదు. కాని ఒకసారి హరిబాల 'అత్యవసర సంగతులు మాట్లాడవలెనని కార్డు వ్రాయుగానే చంద్రనాథ్ ప్రయాణమై యిల్లుచేరినాడు.

హరిబాల యేమైన మంచివార్త చెప్పునేమో అని అతని అభిలాష. కాని తీరయింటికి చేరుసరికాయాశ లేమి యును ఫలించలేదు.

'అవ్వా! ఏమిటి మాట్లాడవలెనని వ్రాసితివే? అన్నాడు హరిబాలతో.

'అబ్బే! ఏమియును లేదు. ఊరకే వ్రాసినాను అన్నదామె.

'ఊరకే నన్నింత శ్రమపెట్టితి వెందుకు?'

'నీ వింటివద్ద ఉండనిచో ఏమి బాగుండును?' అని నిట్టూర్చుచు హరిబాల 'నాయనా! జరిగినదేదో జరిగిపోయినది. ఇకనైనను నీవు మరల సంసార మేర్పరచుకొని కాపురము చేయుదువో నాకీ విచారము తగ్గునా?' అన్నది.

చంద్రనాథ్ వైరాగ్యముగా పెదముగముపెట్టి 'నే నేమిచేయుదును?' అన్నాడు. మహేశశంకర్ అతనినివదలక, చేయి పట్టుకొని 'నాయనా! ఇవి చేతులుకావు; కాళ్ళు నన్ను మన్నించుము. ఆనాటినుండియు నేను లోలోపల తగులబడు

చుంటి నన్నునమ్ము. నాపరిస్థితి అద్వైవమునకే మొరుక 'అని బతిమాలినాడు.

చంద్రనాథ్ ఏమియు మాట్లాడలేకపోయినాడు.

మణిశంకర్ మరల చెప్ప నారంభించినాడు. 'నీవు మరల పెళ్ళిచేసికొని కాపురము చేయుమునాయనా! నేను నీకునచ్చెడి పిల్లను వెదకి యుంచినాను. నిన్ను కనుక్కొనియే చెప్పవచ్చునని వారికి నేనేమాటయును చెప్పలేదు. ఎవరైనను భార్య చనిపోయినచో మళ్ళీ పెళ్ళిచేసికొనరా?' అన్నాడు.

'ఆమె చనిపోయినట్లు తెలియనివ్వండి. అప్పుడు చూడవచ్చును.' అన్నాడు మెల్లగా.

'రామరామ! ఆమాట అనవద్దు బాబూ!'

చంద్రనాథ్ మాట్లాడలేదు.

మణిశంకర్ ఒక్కసారిగా భావురుమన్నాడు. 'నాయనా! నేనే చేతులార నీకాపురము పాడుచేసినాను. నాకీవిచారము చచ్చినసుపోదు.' అన్నాడు.

చంద్రనాథ్ చాలసేపాలోచించి 'సంబంధ మెక్కడ చూచినారు?' అన్నాడు.

మణిశంకర్ కన్నీరుతుడుచుకొని 'కలకత్తాలో. నీవొకసారి వెళ్ళిచూచుకొన్నచో అంతయు నిశ్చయమగును.' అన్నాడు.

'సరే, అట్లయినచో రేపేవెళ్ళెదను.'

మణిశంకర్ దీవించుచు 'అట్లేచేయుము నాయనా! నీకునచ్చినచో కార్డు వ్రాయుము. నేను వెంటనే మనవారిని నల్గురిని వెంటబెట్టుకొని కలకత్తా వత్తును' అన్నాడు.

మరల 'నాయనా! చంద్రనాథా! నేనింకెన్నో రోజు లుబ్రతుకను. నీవుమరల కాపురము చేయుచున్నచో చూచి సంతోషముతో ప్రాణము వదలుదును' అన్నాడు.

ఆమరునాడే చంద్రనాథ్ కలకత్తా వెళ్ళినాడు. బ్రజకిశోర్ కూడ వెళ్లినాడు పిల్లను చూచినతర్వాత 'పిల్ల లక్ష్మీ దేవిలాగున ఉన్నదన్నాడు మేనమామ.

చంద్రనాథ్ మొగము త్రిప్పినాడు. తన అభిప్రాయ మును చెప్పనేలేదు.

ఇద్దరును టిక్కెట్టుకొని రైలెక్కినారు.

'నచ్చినదికదా!' అని బ్రజకిశోరడిగినాడు.

'లేదు'

బ్రజకిశోర్ మిన్నుమీదనుండి పడినట్లయి 'అంత అందమైనపిల్ల కూడ నచ్చలేదా?' అన్నాడు.

'లేదు' అని మరొకసారి అన్నాడు చంద్రనాథ్.

బ్రజకిశోర్ తమస్టేషను రాగానే దిగివెళ్ళిపోయినాడు. చంద్రనాథ్ అలహాబాదుకు టిక్కెట్టు తీసికున్నాడు.

అదంతయువిని మణిశంకర్ నోరునొత్తి మొత్తుకున్నాడు. ఇంక ఏదేమైనను నేనే స్వయముగా కాశీవెళ్లి కోడలిని తీసి కొనివత్తును. వృథాగా సంఘమునకు జడిసి జీవితకాలమును నరకము ననుభవించలేను. కాక సంఘమెవరు? మనమేకదా!' అని అనుకున్నాడు తనలో.

అది విని హారకాళి పళ్ళు పటపటలాడించి 'ఈముసలాడికి చచ్చేకాలము మతిచెడిపోతోంది' అన్నది. గుమాస్తానుపిల్చి 'అబ్బాయి ఇంకేమన్నాడు?' అని అడిగినది.

'ఇంతవరకు కాశీకి ఎంతడబ్బు పంపితివని అడిగినారు. అంతే' అన్నాడు.

'అంతే. ఇంకేమియు అడుగలేదా?' అని మొగము చిట్లించుకుని పోయినది.

## ౧౭

టిక్కెట్టు అలహాబాదునకే కొన్నను మధ్యలో తన ప్రోగ్రాము మార్చుకొని కాశీలో దిగినాడు. అతని వెంటనున్న ఇద్దరు నౌకర్లను బండిమాట్లాడి సామానునెక్కించిరి. వారినిసామానుతో రహదారి బంగళాలో ఉండుమని, తాను కాలినడకనే బయలుదేరినాడు. నడచుచుండగా అతనికి దుఃఖము పొంగి పొరలివచ్చినది. మొగము దిగాలుపడినది. ప్రతి అడుగు బరువైనది. అయినను ఆగక ఎట్లో నడచుచునే యున్నాడు. క్రమేణ హరిదయాలు ఇల్లుదగ్గర పడుచున్నది. ఆదారులన్నియు అతనికి పరిచితములైనవే. ఆ సందు మలుపు వద్ద చిన్నదుకాణమొక్కటి ఉన్నది. ఆ దుకాణపు యజమానుడు ఆ కొట్లో పకోడీలు వండుచున్నాడు. చంద్రనాథ్ అక్కడ అనుకోకుండ ఆగినాడు. దుకాణదారు తలెత్తిచూచెనేకాని అతని దుస్తులను చూచి పకోడీలు కొనుమని అడుగలేకపోయినాడు. ఇతడని తెలిసికొన నారంభించినాడు.

చంద్రనాథ్ ముందుకునడచినాడు. ముందు మలుపు తిరిగినాక అతని కొక్క అడుగైనను పడుటలేదు. కాశీ అంత పట్టణములో ఆఇరుకుసందులో గాలిపేరుకయినను లేదు. అతనికి ఊపిరి పీల్చుకొనుటయే కష్టముగానున్నది. రెండడుగులు వేసి, కొంచెమాగి మరల రెండడుగులు వేయుచున్నాడు. ఎంతసేపు నడచినను దూరము తరుగుచున్నట్లులేదు. అతడు తనలో అట్లు తరుగకూడదనే కోరుకొన్నాడు. అడంగుకి వెళ్లినచో ఏమివినవలసివచ్చునో అని భయము. ఎట్లో హరిదయాల్ ఇంటిముందుకేగి నిలబడినాడు. కేకవేయవలెనను కొననేకాని గొంతుక ఆరుకొని పోయినది. మాటపెకిలిరా లేదు. ఎట్లో రప్పించుకొని పిల్చినాడు. గడియారముకేసి చూచినాడు. తొమ్మిదయినది. మరలపిల్చినాడు. జవాబురా లేదు. దారినపోవు వారతనివంక తలెత్తి చూచినారు. అతడు మరొక కేక వేసినాడు.

ఇప్పుడు లోపలినుండి 'ఇంటిలోలేరు' అని ఒకఆడు గొంతుక వినపడినది. ఆమాటన్న దొక బెంగాలీదాసి.

ఆమె తలుపువద్దకువచ్చి అతని దొర దుస్తులనుచూచి తలుపుచాటునకు తప్పుకొన్నది. కాని అతడు మాతృభాషలో మాట్లాడుటచూచినాక భయము వదలి 'లేరండీ' అని జవాబిచ్చినది.

'ఎంతసేపట్లో వత్తురు?'

'మధ్యాహ్నము.'

చంద్రనాథ్ ఇంట్లోకి వెళ్లినాడు. ఒకమూలసంతోషము, సిగ్గు, సందేహాలతో అతని హృదయము కదలసాగినది. లోప

సరయు ఉండియుండుననని అతనియూహ. తీర వెళ్ళిచూచు సరికిలేదు. 'ఈయింటిలో నింకెవరునులేరా?' అని అడిగినాడు.

'లేరు'

'వీరెక్కడ ఉన్నారు?'

'ఎవరు?'

'ఒకామె...'

'ఇక్కడ నేతప్ప మరెవ్వరును లేరే!'

'ఒక పసిపాప ఉండవలె.'

'లేదు. ఇక్కడెవరును లేరు.

చంద్రనాథ్ మెట్లపై కూర్చుండి 'అట్లయిన వారె క్కడికి వెళ్ళినట్లు...'

దాసి ఆలోచింప సాగినది. 'ఇక్కడ ఎవరునులేరండీ! పండాగారూ నేను ఇద్దరమే ఉంటున్నాము. నెలనాళ్ళనుండి యాత్రికులైనను వచ్చుటలేదు.' అన్నది.

చంద్రనాథ్ తెల్లపోయి నేలకేసి చూచుచు ఉండి పోయినాడు. అప్పుడతని మనసులో ఎన్నెన్ని ఆలోచనలు రేగినవో ఆ అంతర్యామికే యెరుక. కొంతసేపటికి మరల 'నీవిక్కడ ఎన్నాళ్ళనుండి ఉన్నావు?'

'ఏణ్ణార్థమునుండి'

'అయినను నీవిక్కడ ఎవరినిచూడలేదా? ఒకయిత్రని ఆడుది, ఆమెకొక పసిపిల్లదో-పిల్లవాడో లేక ఆమెయొక్క తెరువో ఉండవలె. నీవెవరిని చూడనేలేదా?'

'లేదండీ. నేనెవరిని చూడనేలేదు.'

'వారి సంగతైనను వినలేదా?'

లేదండి.

అతడింకేమియు నడుగలేదు. మాట్లాడక కూర్చుండి పండాగారి రాక కెదురుచూచుచున్నాడు. ఇంక సరయు ఈలోకములోనే లేదనుకొన్నాడు. కాని ఆ వార్తనైనను వినియే పోదలచినాడు. నిమిష మొక యేడాదిలాగ గడుచుచున్నదతనికి.

మధ్యాహ్నము పండావచ్చినాడు. చంద్రనాథుని చూచి ముందుగా ఆయన కొంచెము చకితుడైనాడు. కాని గుర్తించి ఎండిపోయిన యెలుగులో 'చంద్రబాబూ మీరా? ఎప్పుడువచ్చినారు?' అని పలకరించినాడు.

చంద్రనాథ్ నిరుత్సాహముగా 'వచ్చిచాలాసేపయినది. కాని వారెక్కడ ఉన్నారు?' అని ప్రశ్నించినాడు.

'వారా? ఆఁ. వారు...'

చంద్రనాథ్ వణకుచులేచి పెద్దప్రయత్నములో తన్నుతాను సంబాళించుకొని 'ఎప్పుడు చనిపోయినది?' అని అడిగినాడు.

'ఎవరు చనిపోవుట?'

చంద్రనాథ్ దీనముగా 'సరయు ఎప్పుడు చనిపోయినది?' అని అరచినాడు. అతడడిగెడిదిప్పటి కతనికి బోధపడింది. 'ఆమె చనిపోలేదు. కులాసాగానే ఉన్నది.

'ఎక్కడవున్నది?'

'కైలాసు బాబాయి ఇంట్లో'

'వారిల్లు ఎక్కడ?'

'ఈసందుచివరనున్న పనసచెట్టు దగ్గరనే వారిల్లు.'

చంద్రనాథ్ తలపట్టుకొని కూర్చుండి కొంతసేపైన తర్వాత అమె యిక్కడెందుకుండలేదు? అని అడిగినాడు.

పండా తాను చేసినపని తప్పుకాదనుకొని ధైర్యముగా 'మీారే మీాయింట్లోవుండనియ్యక పోయినప్పుడు నేనెట్లుంచు కోగలను? నాకునల్గురి యాత్రీకులతోను పనిఉందునాయె' అన్నాడు.

అతడు చెప్పినది సత్యముగానే ఉన్నదను కొన్నాడు చంద్రనాథ్. కొంచెముసేపాలోచించి 'కయిలాసుగారింటి కెట్లావెళ్ళినది?' అని అడిగినాడు.

'ఆయనే స్వయముగావచ్చి తీసికొని వెళ్ళినాడు.'

'ఎవరాయన?'

'ఇక్కడే, కాశీలో కొన్నేళ్ళనుండి ఉండే బ్రాహ్మణుడు.'

'సరయు అదివరకే ఆయన నెరుగునా?'

'ఆఁ. బాగా ఎరుగును.'

'ఆయన వయస్సెంత?'

హారిదయాలు లోలోపల నవ్వుకొని 'అరువదేళ్లుండు ననుకొందును. ఆయన సరయును కూతురివలె చూచుకొను చున్నారు' అన్నాడు.

'ఇంకను ఎవరున్నారు అక్కడ?'

'ఒకపనిమనిషి, సరయు, విశ్వేశ్వరుడు.'

'విశ్వేశ్వరుడెవరు?'

'సరయు కొడుకు'

చంద్రనాథ్ లేచినిలబడి సరే నేవెళ్లుచున్నాను. 'అని బయటికి వచ్చినాడు. హరిద యాలతని నాపలేదు. సందుచివరికివచ్చి కైలాసుగారి యిల్లేది' అని ఒకముసలాయన నడిగినాడు. ఆతడు చేతితో చూపినాతనియింటిని. చంద్రనాథ్ వెంటనే ఆయింటిలోనికి వెళ్లినాడు. అక్కడ పెద్దవారెవరును కన్పడలేదుగాని వరండాలో దుక్కలాగున నున్న పిల్లవాడొకడు పళ్ళెములోపోసియున్న నీటితో తన మొళ్ళంతను తడుపుకొనుచు, సుఖ్యసుఖ్య అనీళ్లతో ఊగిసలాడుచు, ఆనీటిలో ప్రతిఫలించిన తనవవ్వ్యముఖముమచూచిసంతోషముతో కేరింతలు కొట్టుచున్నాడు. చంద్రనాథ్ గబుక్కున ఆపిల్లవాని నెత్తుకొని లోపలిగదిలోనికి ప్రవేశించినాడు. బాలుడాశ్చర్యమునుగాని, భయమునుగాని పొందలేదు. క్రొత్త మనుష్యుడెత్తుకొనుట తనకు క్రొత్తకాదన్నట్లున్నాడు. వాడు చంద్రనాథ్ ముక్కుపై తనమృదులబాలహస్తమువేసి 'మలి మాలెవలు? అని ప్రశ్నించినాడు.

చంద్రనాథ్ ఎంతోవాత్సల్యముతో ఆబాలునిముద్దు పెట్టుకొని 'నేనా నాన్నను' అని చెప్పికొన్నాడు.

'నాన్నా?'

'అవును. నాన్ననే కాని మరి నీవెవరవు?'

'నేను విశూని'

చంద్రనాథ్ గడియారము గొలుసుతో సహా ఊడదీసి ఆబాలుని మెడలోవేసినాడు. జేబులోనుండి చాకు, పెన్సిలు, పర్సు, చేతికందినవాటినన్నిటిని ఇచ్చినాడు. అంతకన్న తన బిడ్డకిచ్చుటకేమియు లేకపోయినవి.

ఒక్కసారిగా అన్నివస్తువులు తనచేతికి వచ్చునరికి బాలుడు సంతోషముపట్టలేక, 'నానా' అని కేకవేసినాడు. చంద్రనాథ్ వానినోటికి తననోరుకలిపి 'బిడ్డా' అన్నాడు.

ఇంతటిలో దాసి ఎవరోదొరగారు లోపలికి చొరబడి వచ్చి అమాంతముగా విశుని ఎత్తుకొని ముద్దాడుచుండగా, అదిచూచి కంగారుపడి కేకలువేయుచు వంటయింటిలోనికి పరుగెత్తినది. కయిలాసు ఇంటిలో లేడు. ఇన్నాళ్ళకీవేళ విశ్వేశ్వర దర్శనము చేసికొనుటకేగినాడు. ఇంతకు ముందే సరయుకూడ దర్శనము చేసికొనివచ్చి వంటచేయుచున్నది. దాసి కంగారుగా 'అమ్మా!' అని కేకవేసినది.

'ఏమిటే?'

దాసివణకుచు 'మనయింట్లోకెవరో దొరగారువచ్చి మనబాబు నెత్తుకొని పచారు చేయుచున్నారమ్మా!' అన్నది.

సరయు ఉలికిపడి 'ఆఁ. ఎవరేఆయన?' అనుచునే లేచినది! తలుపుచాటున నుండియే చూడవలెననుకొన్నది. కాని చూడలేకపోయినది.

దాసి ఆమె కొంగుపట్టుకొని లాగుచు 'మీరువెళ్ళకండిఅమ్మా!' అన్నది.

సరయు దానిమాటను పట్టించుకొనలేదు. దాసిచెప్పిన దానిని నమ్మలేకపోయినది. కొంచెము ముందునకు పోయిచూచినచో ఆమె అన్నదబద్ధముకాదు. దొరల దుస్తులలోఉన్న ఆయన పిల్లవానితో ముద్దులాడుచున్నాడు. ఆమె చొరవగా కిటికీవద్దకేగినది. నీడను చూచినను గుర్తింపగల వ్యక్తిని

కన్నులకెదుట నున్నవో నెవరనుగుర్తించలేదు! తనభర్తే అనుకొన్నది. చంద్రనాథ్ 'సరయూ!' అన్నాడు.

## ౧౩

భార్యాభర్తలు మాట్లాడుకొనుచున్నారు.

'చాల చిక్కితివే' అన్నాడు చంద్రనాథ్. అతని మొగమువంక చూచినవ్వినది సరయు. చంద్రనాథ్ మరల పసివానిగొడవలో పడినాడు. సరయు అతని బూట్లు త్రాళ్ళు విప్పి ఒక్కొక్కటే కోటు, కమీజు అన్నియును అతను తొడిగినవి విప్పినది. విసనకర్రతో విసరినది. తడిగుడ్డతో కాళ్లుతుడిచినది. వీటినన్నిటిని నిత్యకృత్యాలు లాగ నేచేసినది. ఇదివరలో ఇట్లేచేయుచుండెడిదికదా? ఉజ్జీవితమున ఇక మరల కన పడదనుకొన్న వ్యక్తి తనంతటతాను వచ్చినప్పుడు ఎన్నికన్నీళ్లుకార్చవలసినది. కాని అదేమియు జరగలేదు. నిత్యము తన భర్త వచ్చుచున్నట్లే, రాగాపోగా ఈ వేళ కొంచెమాలస్యమైనట్లు మాత్రమే ఉన్నదామెకు.

చంద్రనాథ్ పరిస్థితి మాత్రము వేరుగా నున్నది. విశ్వంతో మాట్లాడునప్పుడింక ఆయింటిలో ఎవరునున్నట్లే అనుకొనుటలేదు ఆకొడుకుతో అంతఆప్యాయముగా మాట్లాడుచున్నాడు.

'బాబూ! పోయి, ఆడుకో!' అన్నదితల్లి.

విశ్వం మంచంమీదనుండి దిగబోవుచుండగా చంద్రనాథ్ క్రిందికిదింపినాడు. ఆశ్చర్యపడుచుండు తనతల్లి అతనిపాదాలకు నమస్కరించుట చూచినందున తానుకూడ

రెండుకాళ్ళకు వంగి నమస్కరించి పరుగెత్తినాడు. చంద్రనాథ్ చేతులుసాచి పట్టుకోబోయినాడు కాని బాలుడందలేదు.

సరయు భర్తగుండెపై చేతినివేసి 'ఒళ్ళింత ఎండిపోయినది. ఏమైన సుస్తియా?' అన్నది.

'లేదు. రోగమేమియులేదు.'

'మరి ఎక్కువగా విచారము పెట్టుకొన్నారా?'

చంద్రనాథ్ ఆమెముఖముకేసి చూచుచు 'నీవేమనుకొనుచున్నావు?' అన్నాడు

సరయు దానికిబదులు చెప్పక మాటమార్చి వేసినది. వేళయినది నడవండి స్నానము చేయుదురుగాని.'

'ఇంటి యజమానురాలేరీ?'

వారీవేళ విశ్వేశ్వర దర్శనమునకు వెళ్ళినారు. సాయంకాలమునకు కాని రారనుకొందును '

'నీవాయననేమని పిల్తువు?'

'ఇదివరకువలెనే ఇప్పుడును పిల్తును. మరి మీకూడ ఎవరువచ్చిరి?'

'హరి, మధు (నౌకర్లు) వచ్చినారు. రహదారి బంగాళాలో ఉన్నారు.'

'వాళ్ళనుకూడ ఇక్కడికి తీసికొని వచ్చుటకు చొరవ చాలలేదేమో?'

చంద్రనాథ్ మాట్లాడలేదు.

అతడు భోజనమునకు కూర్చుండగానే ఎదురుగానున్న పూరీల పళ్ళెముచూచి ఆశ్చర్యపోయినాడు. అపరిమితముగా

పళ్లెమును త్రోయుచు 'ఇదేమిటి వేళాకోళము చేయుచుంటివా?' అన్నాడు.

సరయు చిన్నపోయినది. తలవంచుకొని 'మీరు తినరా?' అన్నది.

చంద్రనాథ్ ఆమెకేసిచూచి 'నేనెప్పుడైనను మధ్యాహ్నమున పూరీలుతింటినా!'

సరయు లోలోపల విచారపడి ఊరకున్నది.

చంద్రనాథ్ మరల 'నీవీనాడేకాదుగదా నాకుభోజనము వడ్డించుట. నేనేమితిందునో కూడ మరచిపోలేదనుకొందును.'

సరయు కన్నులలో నీళ్లు తిరిగినవి. ఇప్పుడారోజులు గతించినవికదా అనుకొన్నది మనస్సులో. 'అన్నముతిందురా? మరి...'

'మరి... ఏమిటి? చల్లారినదా ఏమి?'

'లేదు. నేనిక్కడకూడ అన్నమేవండుచున్నాను.'

'ఇంటివద్దను వండెడిదానవుకదా!'

సరయు కొంతసేపాగి 'మరినాచేతియన్నముతిందురా?'

చంద్రనాథ్ తలవంచుకొన్నాడు. సరయును వదలినట్లుగాని, ఆమె దోషదూషితగా శంకింపబడినదని కాని, ఇంతవరకు నతనికి తోచనేలేదు. సరయుమాటలలో ఎంతోమంట ఇమిడియున్నది. కొంచెముసేపు మాట్లాడకుండ ఉండి' 'సరయూ! ఈమిట్టమధ్యాహ్నము వేళ నాకన్నులలో నీరు చూడనిదే నీకుతృప్తిలేదా?' అన్నాడు.

సరయు తటాలున లేచి 'అట్లయిన ఇప్పుడే వత్తును' అని వంటయింట్లోకి వెళ్ళి తెగ ఏడ్చినది. కన్నీరు తుడుచుకొని మొగము కడుగుకొన్నది కాని ఆగుటలేదు. ఆమె ఎంతఅయినను తన్నుతాను ఊరడించుకోలేక పోయినది. కాని భర్త ఆకలితో ఉన్నాడని వెంటనే అన్నము తెచ్చినది. మామూలుగానే దగ్గరకూర్చుండి వడ్డన చేసినది. ఆయన భోజనము చేసి వెళ్లినాక ఆ ఎంగిలిపళ్ళెముతో వంటింట్లోకి వెళ్లి మరొకసారి ఏడ్చినది.

రెండుగంటలయినది. చంద్రనాథ్ పక్కలో విశ్రాంతి నిద్రపోవుచున్నాడు. అంతలో సరయు వచ్చినది.

'ఏమి? పనిఅయినదా?' అన్నాడు చంద్రనాథ్.

'పనేమున్నది లెండి. ఇంకా మా పెదనాన్నగారు రాలేదు.'

తరువాత సరయు అతనిని ఇంటిసంగతులు అడిగినది. తనయింటిలోని ప్రతి గది, ప్రతి చిన్నవస్తువు, దాసీలు, గుమాస్తా, హరిబాల, ఇంకను ఇరుగుపొరుగు వారందరి సంగతిని అడిగినది. ఇవన్నియు తెలిసికున్నందున ఆమెకేమియు లాభములేదు. చెప్పుటవలన చంద్రనాథ్‌కేమైన సిగ్గువేయునేమో అని ఆలోచించలేదు. సాయిలా-బాయిలాగా ఆమె అడుగుచుండగా హుషారుగా అతడు జవాబిచ్చినాడు. ఇద్దరును పరమమిత్రులు విడిపోయి కలిసినట్లున్నారు.

తటాలున మధ్యలో 'మరిమీరు పెళ్లెక్కడ చేసికొన్నారు?' అని సరయు అడిగినది.

'పటమటలో'

'పెండ్లికూతురెట్లుండును?'

'నీలాగే'

ఆమాటవినుటతో సరయుకి మనస్సులో కొంచెము బాధకల్గినది. ఆమె సహించలేకపోయినది. కూర్చున్నదట్లానే పడిపోయినది. ముఖమురంగు ఒక్కసారిగా తెల్లపడిపోయినది.

చంద్రనాథ్ గాబరాపడి మంచముదిగి ఆమె చేయి పట్టుకొని లేవదీయుటకై ప్రయత్నించినాడు. కాని ఆమె స్పృహతప్పి పడియున్నది. అప్పుడతడు తలవద్ద కూర్చుండి తలను తనయొడిలో పెట్టుకొని ఏడ్చుచు 'సరయూ! సరయూ!' అని పిల్చినాడు.

సరయు కన్నులు తెరచి ఒక్కక్షణము భర్తకేసిచూచి మరల మూసికొన్నది. ఆమె పెదవులు కదలుచున్నవి, ఏదో అన్నదికాని అది సరిగా తెలియలేదు.

చంద్రనాథ్ భయపడి నీరుతెచ్చుటకు నౌకరువిడిచేసినాడు. దాసి ప్రక్కనేఉన్నది. ఆమె చప్పున నీరుతెచ్చినది. ఆమె యేమియు కంగారుపడక 'బాబుగారూ! కొంచెము సేపటిలో తేరుకొంటారులెండి. ఈవిడ అప్పుడప్పుడిట్లా అవుతునేఉంటారు.' అన్నది.

సరయు మొగముమీద నీరు చిలకరించి, వీవనతో విసరినారు. విశ్వంవచ్చి జుట్టుపట్టుకొని లాగి 'అమ్మా! అని కేకవేసినాడు.

సరయుకి తెలివివచ్చినది. ఆమె సిగ్గుపడుచు తల్పమీదికి ముసుగు లాగికొనుచు లేచికూర్చున్నది. దాసి తనపని మీద వెళ్ళిపోయినది

అప్పుడు భయముతో చంద్రనాథ్ ముఖమునల్లబడి యున్నది.

సరయు నవ్వినది. ఆమె చిరునవ్వుతో 'మీరు భయపడిరా!' అన్నది.

చంద్రనాథ్ కన్నులలో నీళ్లు గిర్రున తిరిగినవి. జలజల క్రిందికి రాలసాగినవి. చేతితో వాటిని తుడుచుకొనుచు 'నే నంతయు అయిపోయినదే అనుకొన్నాను' అన్నాడు.

'మీ మొడలో నా తలఉండగా నాకంత అదృష్టమే కలిగిన లేపదేమున్నది?' అనుకొని అతనితో 'నాకప్పుడప్పుడట్లా జరుగుట మామూలే లెండి' అన్నది.

'చూచితిరిగదా! ఇదివరకు లేకపోయినను ఇప్పుడు జరుగుచున్నదని తెలియుచునే ఉన్నది.' అన్నాడు.

కొంచెముసేపు మాట్లాడకుండ ఉండి జేబులోనుండి తాళపుచెవులగుత్తి తీసి సరయు చేంగునకుకట్టి 'ఇదిగో నీతాళపుచెవులగుత్తి నాకప్పగించి వచ్చితివికదా! మరల నీకప్పగించుచున్నాను. ఈమధ్యలో దీనిని వాడితినేమోచూడు.' అన్నాడు.

సరయు చిలుముపట్టినతాళము చెవులనుచూచి 'మరి దీని నామెకియ్యలేదేమి? అన్నది.

చంద్రనాథ్ దీనవదనమొక్కసారిగా నవ్వుతో నిండినది. కన్నులవెంట ప్రేమ ప్రవహించినది. 'ఆమెకే నేనిచ్చినది' అన్నాడు.

సరయుకు తెలియలేదు. కొంచెముసేపు భర్తమొగము కేసి అనుమానముగా చూచి 'నేనడిగెడిది క్రొత్తభార్యను

గూర్చి. మీరు పునర్వివాహముచేసికొన్న యామె కెందు కియ్యలేదు?' అని అడిగినది.

ఇక చంద్రనాథ్ ఉండబట్టలేక పోయినాడు. రెండు చేతులతో సరయు మొగమును దగ్గరగాలాగికొని గుండెల కదుముకొని 'ఆమెకే యిచ్చితిని సరయూ! నాకిద్దరు పెళ్లాలు లేరు. ఒక్కర్తే. ఆమె ఎన్నడును ప్రాతది కాదు. నవనవము గానే ఉండును. ఇదివరకు నేనామెను కాశీవిశ్వేశ్వరుడు ప్రసాదించిన పువ్వుగాగ హృదయమునకు హత్తుకుని తీసికొని వెళ్ళినప్పుడెంత క్రొత్తగానున్నదో, మరల ఆవిశ్వనాథుని పాదసన్నిధానమునుండి తీసికొని వెళ్ళుటకు వచ్చినపుడుకూడ అట్లే క్రొంగ్రొత్తగానే ఉన్నది.' అన్నాడు.

సంధ్యవేళ దీపాలు వెలిగించి పిల్లవానిని చంకనెత్తు కొనివచ్చి సరయు భర్తదగ్గరకూర్చున్నది. 'పెదనాన్నగారిని కలిసికోకుండ మీరు వెళ్ళుటకు వీలులేదు. ఈరాత్రికి మీ రిక్కడ ఉండవలసినదే' అన్నది.

'అట్లే నాకీపూటకు వెళ్లుటకు వీలులేనట్లే తోచు చున్నది.'

సరయు చాలసేపటినుండి ఏదో చెప్పవలెనని ఊగు లాడుచున్నది. కాని సిగ్గుమూలాన చెప్పలేక జంకుచున్నది. ఇంతవరకు చెప్పుట కవకాశమును దొరకలేదు. ఇప్పుడామె 'మీముందు నాకుసిగ్గెందుకు?'— అనుచుండగా చంద్రనాథ్ ఆమె మొగముకేసి చూచుచున్నాడు. 'మీకొక ఉత్తరము వ్రాయుదమనుకొన్నాను.' అన్నది.

'మరెందుకు వ్రాయలేదు? నేనువద్దన లేదుకదా!'

సరయు కొంచెమాలోచించి 'మీ కెక్కడ కోపము వచ్చునోఅనిభయము వేసినది.సరేకానిమీరెప్పుడు వెళ్లుదురు?'

'నీయిష్టము.'

ఇక తనమనస్సులోని మాటను చెప్పివేయవలెనను కొన్నది. ఎప్పుడేమిజరుగునో తాననుకొన్నది చెప్పుటయే పడదేమో! ఇతడు మరల రావచ్చుగాని, అతడువచ్చుసరికి తానుండునో – ఉండదో అనుకొని 'మీముందునాకు సిగ్గేమియులేదు.' అన్నది.

'అదిఇందాకనే విన్నానుగా అసలు చెప్పదలచినదేదో చెప్పు.'

సరయు కొంచెము తమాయించుకొని 'ఇంకనాకు బ్రతుకవలెనని లేదు. ఇట్లాజీవించుట యేమియు బాగుగా లేదు అన్నది.

ఈమాట వేళాకోళముగా అన్నది కాదని చంద్రనాథ్ గ్రహించినాడు. సరయు మొగము పాలిపోవుటచూచి భయపడి 'సరయూ! నీకేమైనను దీర్ఘ వ్యాధి సోకినదా?' అన్నాడు.

ఆమె యేదోనవ్వుతూ 'లేదు. కాని అప్పుడప్పుడు గుండెలో నొప్పిగా ఉండును.'

'మరిమూర్ఛ?'

'అదేమంత బాధాకరముకాదు లెండి.'

చంద్రనాథ్ 'నేదలచుకొన్నంత ఇప్పటికే అయినది. కాని యింక ఏ ప్రమాదము రాకుండ నేనేరక్షించుకొందును' అనుకొన్నాడు తనలో.

'మిమ్మల్నొకటి అడుగుదును. ఇత్తురా?' అని అడిగినది సరయు.

'ఏమిటది?'

'నేను నాకోసమై ఏమియు అడుగనుకాని, నామరణ వార్త విన్నాక'—అని బిడ్డను భర్తపాదములవద్ద కూర్చుండబెట్టి 'ఒక్కసారివచ్చి నుగ్రవానిని తీసికొనివెళ్ళండి' అన్నది.

చంద్రనాథ్ ఎంతో ప్రేమతో పిల్లవాని నెత్తుకొని ముద్దాడినాడు. ఇంతలో బయటనుంచి కైలాస్ 'విశ్వా!' అని పిల్చినాడు.

విశ్వం వెంటనే తండ్రిఒడిలోనుండి తప్పించుకునిదిగి 'తా - తా' అని పరుగెత్తినాడు. సరయూ లేచినిలబడినది. 'అరుగో పెదనాన్నగారు రానేవచ్చినారు' అన్నది.

కైలాస్ విశ్వమునెత్తుకొని లోనికివచ్చినాడు. చంద్రనాథ్‌కూడ బయటికి రెండడుగులు వచ్చినాడు. కైలాసు అదివరకెన్నడు నతనినిమాడలేదు. అందుచే అతనిని గుర్తుపట్టలేదు. అతడా క్రొత్తవారెవరాఅని చూచినాడు. బాలుడే పరిచయము చేసినాడు 'నాన్న' అని.

చంద్రనాథ్ నమస్కరించినాడు. కైలాస చంద్రుడు అతనిని దీవించుచు 'కూర్చుండు నాయనా! కూర్చుండు' మన్నాడు.

౧౮

చంద్రనాథ్ మరునాడు కుటుంబమును తీసికొనివెళ్ళుదు ననుసరికి, కైలాసు గుండెలలో నెయ్యితుపాకులొక్కసారిగా

ప్రేలినట్లయినా, తానేమనెనో తనకే తెలియదుకొని, ఎవరో దూరమునుండి 'అంతకన్న నయముకావలెను!' అన్నట్లు మాటలను మాత్రము చంద్రనాథ్ విన్నాడు.

సరయుకూడ విచారించినది. ఆమెకన్నులనుండికన్నీరు ధారగా ప్రవహించినది. భర్తపాదములపై తలపెట్టి 'మీ పాదధూళిని ప్రసాదించి ఈదురదృష్టవంతురాలి నిక్కడనే వదలివెళ్ళండి. మీతో తీసుకొని వెళ్ళవలదు' అన్నది.

'ఏమి?' అన్నాడు చంద్రనాథ్

సరయు ఆమాటకు జవాబియ్యలేక పోయినది. కాని యేడ్చినది. ఆమె కన్నులనుండి వ్యర్థ కైలాసు దీనముఖము కనపడసాగినది.

కొంచెముసేపుండి చంద్రనాథ్ 'నేనునీభర్తను. నీకిష్టములేకపోయినను లాభములేదు. నేనుబిడ్డనువదలి ఉండలేను.'

సరయు తనకింక మాట్లాడు నవకాశము లేదనుకొని యూరకొన్నది.

మర్నాడుదయముననే కైలాసుమామూలుగావిశ్వము నెత్తుకొని చదరంగపుబరిణ పుచ్చుకొని శంభుమిశ్రా ఇంటికి వెళ్లినాడు. ఆయనను కేకవేసిపిలిచి 'మిశ్రాగారూ! ఈనాడునాకెంతో సంతోషకరమైనరోజు. ఈనాడే మా విశ్వం తనయింటికి వెళ్ళిపోవును. పెద్దవాడైనాడుకదా! ఇక నా కీదకొంపలో ఉంచుట బాగుండదు' అన్నాడు.

దానిపై మిశ్రాకూడ సంతోషమును వెలిబుచ్చినాడు.

కైలాసు పావులుపేర్చి 'రా, ఈనాడు నిన్నొక రెండుపందెము లోడించెదను' అన్నాడు.

కాని ఆట మొదలుపెట్టినది మొదలు కైలాసు బలగ మొక్కొక్కటిగా చంపబడినవి. ఏనుగునెత్తిపోయి గుర్రమును, గుర్రముతో ఎత్తువేయదలిచి శకటును, నడుపుచున్నాడు. ఇట్లానే ఆటదగ్ధమైపోయినది. 'ఈనాడు మీామనసు కుదురుగా లేదనుకొందును. అన్నిటిని తప్పుటెత్తులనే వేయుచుంటిరే' అన్నాడు మిశ్రా.

వరుసగా రెండాటలు నోడినాడు కైలాసు. ఇంకఆట ఆపివేసి పిక్కలను బరిణలో సర్దుచు ఎర్రమంత్రిని విశ్వమున కిచ్చి 'ఇదిగో బాబూ! దీనిని నీకిచ్చివేయుచున్నాను. ఇంకెప్పుడును నాకియ్యవద్దులే' అన్నాడు. ఇంటికితిరిగివచ్చుచు కనపడిన వారందరికిని అశుభవార్త చెప్పినాడు.

కైలాసుముసలివాడైనను ఆనాడు ప్రతిపనిలోనుఉత్సాహముగా ఉన్నాడు. అయిననేమి ఏపనియు పూర్తియగుట లేదు. చదరంగములోలాగుననే పొరపాట్లు వచ్చిపడుచున్నవి. ప్రొద్దునడచిన కొలది అతనికి మతిలేకుండ పోవుచున్నది. అది చూచి సరయు ఎన్నోసార్లు కన్నులనీరు పెట్టుకున్నది. కాని ఆయన ఉత్సాహము తగ్గలేదు. ఆయనను చాటునకు పిలిచి సరయు అతని పాదధూళిని స్వీకరించి ఏడ్చుచుండ కన్నీరాపుకొని కైలాసు దీవించుచు 'అమ్మాయి! నీవేడువవద్దమ్మా! నాటివనతో నీవు రాణివి కాగలవు. ఎప్పుడైనను నీవు కాశీకి వచ్చినచో ఈకుటీరమును మరచి మరెక్కడను దిగవద్దుసుమా!' అన్నాడు.

సరయు ఆమాటవిని మరింతగా ఏడువసాగినది. తాను నిరాశ్రయురాలై కాశీకి వచ్చిననాటిసంగతి గుర్తువచ్చినది.

'పెదనాన్నగారూ! మీరు నన్నువిడచి ఉండలేరు.' అన్నది.

'అమ్మాయి! నేనింకెన్నాళ్ళు బ్రతుకుదునులే.' అన్నాడు కైలాస్.

సరయు కన్నీళ్లు తుడుచుకొనుచు విచారముతో 'మనకు దయా-దాక్షిణ్యాలులేవు' అన్నది.

'శివశివ! అట్లనకమ్మా! నీమనసెరుగుదును తల్లీ! అన్నాడు.

రాత్రి పదిగంటలైనది. అందరును స్టేషనుకుచేరిరి. బండికి టైముకావచ్చినది.

విశ్వం నిద్రపోయినాడు. కాని నిద్రలోకూడ ఎర్ర మంత్రిని గట్టిగాపట్టుకొనే ఉన్నాడు. కైలాసు బాలుని కదిపి లేపినాడు. నిద్రలోలేచిన మూలాన ముందుగా ఏడువబోయి నను, వెంటనే 'తాతా!' అన్నాడు.

'ఓరినాబాబూ! నీవెక్కడికి వెళ్లుచున్నావురా!'

'ఎల్లిపోతున్నాం' అని మంత్రినిచూపి 'మంతిలి' అన్నాడు.

'అవునునాయనా! మంత్రిని పోగొట్టుకోకే.'

దంతపు మంత్రినిగూర్చి విశ్వము నెన్నోసార్లు హెచ్చరించినాడు కైలాసు. బాలుడు 'పోగొత్తనుతాతా! అని తలూపినాడు.

బండిరాగానే సరయు కైలాసు పాదధూళిని నొసటికి పెట్టుకుని రైలులోనికెక్కినది. వృద్ధుని మనసులో నున్న దీవనవెల్లువులను దాటి రాలేకపోయినది.

ఇంక రైలు బయలుద్దేరుట కింకెంతో సేపులేదని కైలాసు విశ్వమును చంద్రనాథ్ కిచ్చి 'బాబూ! విశ్వా!' అన్నాడు.

'తాతా!'

'మంత్రిని'

విశ్వం మంత్రివంక చూచినవ్వుచు 'తాతా! మంతిలి.' అన్నాడు.

'పోనొట్టుకోకు.'

'ఊహూం.' అనితలూపినాడు.

ముసలివాని హృదయము సహింపలేకపోయినది. బండిబయల్దేరి నడుచుచుండగా కిటికీలో నుండి తలపెట్టి 'ఇంక దిగబడుదు నమ్మాయి!' అని గట్టిగా 'బాబూ! విశ్వా!' అని కేకపెట్టినాడు. కాని రైలు చప్పుడులో, జనులగోలలో ఆతని పిలుపు విశ్వమునకు వినబడలేదు. రైలు చప్పుడు వినపడు నంతసేపు కైలాసు అక్కడనే ఉండిపోయినాడు. తరువాత మెల్లగా ఇంటికిచేరుకున్నాడు, అతని అప్పటిబాధను దైవ మెరుక. కొన్నాళ్ళు కలిసి యున్నప్రేమ అట్లనిపించును. అంతే, అదొకబంధము.

## ౧౯

పినతండ్రి, మణిశంకర్ అన్నమాటలతో చంద్రనాథ్ నకున్న కొంచెము భయముపూడ పోయినది. 'బాబూ! పాపము చేసినవానికి ప్రాయశ్చిత్తముకాని, చేయనివానికి ప్రాయశ్చిత్తమెందుకు? అనవసరముగా ప్రాయశ్చిత్తమని ఆమెను కలవరపెట్టకు. అన్నమాటలు ఆతనికిచాల క్రొత్తలుగా

వినిపించినవి. చంద్రనాథ్ ఆశ్చర్యముతో చూచుచు నిలబడి పోయినాడు. మణిశంకర్ మరలఅందుకొన్నాడు. 'నాయినన్నేళ్ళ జీవితములోను ప్రతికుటుంబములోను ఏదో యొకదోషము, ఏదోయొక సిగ్గుకల్గజేసే సంఘటనే మాదిరిని. ప్రతిమానవుడు చిరకాలము పయనించవలెగదా! ఆ అనంతమార్గములో ఎన్నో మెట్ట - పల్లము లుండును. కాన మానవునికి కాలు జారుటసాజమే. కాని [illegible] మాటుచేసి పై వారిసంగతి చర్చించుచు [illegible] లోపముల తెలుగెత్తి చాటుట తమదోషములను కప్పుకొనుటకు మాత్రమే. ఆసంద డిలో తమదోషాలు [illegible]' అన్నాడు.

చంద్రనాథ్ వినుచున్నాడు. మణిశంకర్ కొంచెమాగి మరల నందుకొన్నాడు. 'నాయనా! ఇప్పుడు నేనొక క్రొత్త పాఠము నేర్చుకున్నాను. మనవారిని పరాయివారినిగా చేయ వచ్చు - పరాయివారిని మనవారినిగా చేయువచ్చు. కాని ఒక్కసంగతి. మనవారిని పరాయి వారినిగా ఎవరైనను చేయుదురా! నేనిన్నాళ్ళు నట్టిగుడ్డిలో పడినాను. ఈనాడు విశ్వేశ్వరుడు నాకన్నులు తెరచినాడు. వాని అదృష్టము వలన అంతయు పవిత్రమైనది. ఈనాడు ద్వాదశి. రేపు పూర్ణిమనాడు ఊరందరిని భోజనమునకు పిలిచినాను. వెన కటికాల అన్నయ్య ఉన్నప్పుడు అన్నిటిని ఆయన చూచుకొనే వాడు. నేనెప్పుడు నేమియు చేయలేకపోతిని. కాని ఇప్పుడు నేనే మనవిశ్వమునకు అన్నప్రాశనము చేయదలచినాను.'

చంద్రనాథ్ కొంతఆలోచించి 'కాని మరి సంఘమో?' అన్నాడు.

ఇంక రైలు బయలుదేరుట కెంతో సమయములేదని కైలాసు విశ్వమును చంద్రనాథ్ కిచ్చి 'బాబూ! విశ్వా!' అన్నాడు.

'తాతా!'

'మంత్రిని'

విశ్వం మంత్రివంక చూచినవ్వుచు 'తాతా! మంతిలి.' అన్నాడు.

'పోగొట్టుకోకు.'

'ఊహూం.' అని తలూపినాడు.

ముసలివాని [illegible] నిష్ప్రయోజనమైనది. బండిబయలుదేరి నడుచుచుండగా కిటికీ [illegible] పెట్టి 'ఇంతే దిగబడుదునమ్మాయి!' అని గట్టిగా 'బాబూ! విశ్వా!' అని కేకపెట్టినాడు. కాని రైలు చప్పుడులో, జనులగొడవలో అతని పిలుపు విశ్వమునకు వినబడలేదు. రైలు చప్పుడు వినపడునంతసేపు కైలాసు అక్కడనే ఉండిపోయినాడు. తరువాత మెల్లగా ఇంటికిచేరుకున్నాడు. అతని అప్పటిబాధను దైవ మెరుగు. కొన్నాళ్ళు కలిసి యున్నప్రేమ అట్లనిపించును. అంతే, అదొకబంధము.

## ౧౯

పినతండ్రి, మణిశంకర్ అన్నమాటలతో చంద్రనాథ్ నకున్న కొంచెము భయముకూడ పోయినది. 'బాబూ! పాపము చేసినవానికి ప్రాయశ్చిత్తముగాని, చేయనివానికి ప్రాయశ్చిత్తమెందుకు? అనవసరముగా ప్రాయశ్చిత్తమని ఆమెను కలవరపెట్టకు. అన్నమాటలు అతనికిచాల క్రొత్తలుగా

వినిపించినవి. చంద్రనాధ్ ఆశ్చర్యముతో చూచుచు నిలబడి పోయినాడు. మణిశంకర్ మరలఅందుకొన్నాడు.'నాయిన్నేళ్ళ జీవితములోను ప్రతికుటుంబములోను ఏదో యొకదోషము, ఏదోయొక సిగ్గుకల్గజేసే సంఘటనే చూచితిని. ప్రతిమానవుడు చిరకాలము పయనించవలెగదా! ఆ అనంతమార్గములో ఎన్నో మెట్ట - పల్లము లుండును. కొంత మానవునికి కాలు జారుటసాజమే. కాని మొనగాళ్ళంత తమ పొరపాటు మాటుచేసి పై వారిసంగతి చర్చింతురు. ఇట్టి కపటవేషుల నెలుగెత్తి చాటుట తమదోషములను కప్పుకొనుటకు మాత్రమే. ఆసందడిలో తమదోషాలు మరుగున పడిపోవునని యూహ.' అన్నాడు.

చంద్రనాధ్ వినుచున్నాడు. మణిశంకర్ కొంచెమాగి మరల నందుకొన్నాడు. 'నాయనా! ఇప్పుడు నేనొక క్రొత్త పాఠము నేర్చుకున్నాను. మనవారిని పరాయివారినిగా చేయవచ్చు - పరాయివారిని మనవారినిగా చేయవచ్చు. కాని ఒక్కసంగతి. మనవారిని పరాయివారినిగా ఎవరైనను చేయుదురా! నేనిన్నాళ్ళు నట్టిగుడ్డిలో పడినాను. ఈనాడు విశ్వేశ్వరుడు నాకన్నులు తెరచినాడు. వాని అదృష్టము వలన అంతయు పవిత్రమైనవి. ఈనాడు ద్వాదశి. రేపు పూర్ణిమనాడు ఊరందరిని భోజనమునకు పిలిచినాను. వెనకాల అన్నయ్య ఉన్నప్పుడు అన్నిటిని ఆయన చూచుకొనే వాడు. నేనెప్పుడు నేమియు చేయలేకపోతిని. కాని ఇప్పుడు నేనే మనవిశ్వమునకు అన్నప్రాశనము చేయదలచినాను.'

చంద్రనాధ్ కొంతఆలోచించి 'కాని మరి సంఘమో?' అన్నాడు.

మణిశంకర్ నవ్వుచు 'సంఘము! సంఘమెవరు? నీవు, నేనేకదా! డబ్బున్నవాడే సంఘానికధ్యక్షుడు. నేను తలచుకొన్నచో నీజాతిపోగొట్టగలను. నీవుతలచుకొన్నచో నాజాతి పోగొట్టగలవు. ఇంతవరకు చెప్పని విషయమొకటున్నది. ఎన్నడును బయటపెట్ట దలచుకోలేదు. కాని ఇప్పుడు నీతో చెప్పినందున ప్రమాదమేమియు లేదు. కనుక చెప్పుచున్నాను. రాఖాలు దాసుమాట గుర్తున్నదా?'

'ఆఁ. హరిదయాలు ఉత్తరములో అతనిని గురించి చదివినట్లుగుర్తు.'

'మన సంసారమునకు సిగ్గుకల్గజేయు విషయమేదైన ఉన్నచో దానిని ఋజువు చేయగలవాడతడొక్కడే. కాని యిప్పుడతడిక బయటపెట్టలేడు. నేవానిని ఖైదుకు పంపినాను. కొద్దిరోజులుక్రితమే విడుదలఅయి ఎటోపోయినాడు. ఇక ఈమూలకేరాడు.'

మణిశంకర్ రాఖాలు కథనంతను చంద్రనాథ్‌కి చెప్పినాడు. అదివినుసరికి అతనికన్నులు చెమ్మగిల్లినవి.

పౌర్ణమినాడు చంద్రనాథ్ ఇంట్లో ఊరందరు విందు చేసిరి. ఏవొక్కడును నోరెత్తలేదు. మణిశంకరుని ఆనాటి పెత్తనముచూచి అందరునువట్టిఅపవాదేవచ్చినదనుకొన్నారు. బహుశః అదికూడ జమీందారీ యెత్తేనేమో! అనుకొన్నారు కూడ. హరకాళి తనకై వేరేవండించుకొని తిన్నది. వారిక నీ యూరిలో నుండరు. తమగ్రామమునకు వెళ్ళుదురు. ప్రాణముపోయినను సరేకాని వారుమాత్రము ధర్మమును వదలలేరు. పాపము!

అది ఆనందకరమైనను, విచారకరమైనను చంద్రనాథ్ వారిజీవికకై నెల కదివరకిచ్చెడి ఏబదిని వందగామార్చినాడు.

అన్నప్రాశనోత్సవము పూర్తియైనది నృత్యములు - గానములు ముగిసినవి. ఎవరియిండ్లకువారు వెళ్ళిరి. అందరును వెళ్ళినాక యింటికివచ్చి చూడగా ఆపాదమస్తకము పరమేశ్వరిలాగున సర్వాలంకార భూషితయై సరయు కొడుకు నెత్తుకొనియున్నది. భర్తరాక కెదురుచూచు చున్నది.

నేడు వారికిపౌర్ణమి.

చంద్రనాధ్ 'ఏమిటీవేళ ఈపోరు?' అన్నాడు.

సరయు చిరునవ్వుతో నాచెలి నన్నేరీతిగాను వదల లేదు.' అన్నది.

## ౨౦

ఆరాత్రి ఒకొక్కడుగే వేసికొనుచు ఆముసలి కైలాసచంద్రుడు యింటికి తిరిగివచ్చినాడు. తులసికోటపై ఇంకను, దీపమింకను వెలుగుచునే యున్నది. కాని ఆతని కంతయు నంధకారబంధురముగనే యున్నది. అంతవరకు నక్కడ అందరు నున్నారు. ఇప్పుడో ఎవరునులేరు. ఒక్క దీపము మాత్రము వెలుగుచున్నది. దాని జీవితముకూడ పూర్తికావచ్చినది. దానిని సరయు తనచేతితోనే వెలిగించి వెళ్ళినది.

కైలాసువచ్చి మంచముపై వ్రాలినాడు. కన్నులు మూతలుపడుచున్నవి. ఎవరో 'తాతా' అని పిలిచినట్లున్నది. 'దశరథమహారాజు మృత్యుశయ్యపైనుండి, కంపించెడి పెదవులతో 'రాతిరిగిరా' అంటున్నట్లుగా కలగన్నాడు.

తెల్లవారగానే కైలాసు లేచి వచ్చుచునే అలవాటు ప్రకారము 'విశూ' అనిపిలిచినాడు. తర్వాత గుర్తువచ్చినది. 'విశూలేడు. వానియింటికి వెళ్లినాడ'ని.

చదరంగపు బరిణతో అతడు శంభుమిశ్రా ఇంటికి వెళ్ళినాడు. మిశ్రాతో 'మావిశూ వెళ్లిపోయినాడు' అని చెప్పినాడు.

విశూ అన్నచో అందరికిని ప్రేమయే. మిశ్రాకూడ విచారించినాడు. ఆటకు బలగమును సర్దినతరువాత 'బాబా! ఎర్రమంత్రి ఏదీ?' అని అడిగినాడు మిశ్రా.

కైలాస్ పెద్ద నిట్టూర్పువదలి 'అరే. ఆఁ. మిశ్రా గారూ! దానిని విశూ తీసికొనివెళ్ళినాడు. ఆ ఎర్రమంత్రి అన్నచో వానికి బాగా ఇష్టము. పిల్లవాడుకదా! ఎటూవదల లేదు! అన్నాడు.

తానే బుద్ధిపూర్వకముగా ఇచ్చి తనబలగము నంతను పాడుచేసి కొంటినని చెప్పుటకతనికి సిగ్గువేసినది.

'అట్లయిన మరొక బలగము తేనా?' అన్నాడుమిశ్రా.

'తే'

ఆటలో కైలాస్ ఓడినాడు. శంభుమిశ్రా కైలాసుతో ఎన్నాళ్ళనుండియో ఆడుచున్నాడు కాని, ఎన్నడు నోడించ లేకపోయినాడు. అట్టివాడీనాడేల ఓడిపోయెనో కారణమిట్టే తెలిసినది. 'బాబా! విశూ తనతోపాటు నీ తెలివి తేటలన్ని కూడ తీసికొని వెళ్ళినట్లున్నాడే!' అన్నాడు.

కైలాసు చిరునవ్వునవ్వి 'ఇంకొక ఆట ఆడిచూదము. రమ్ము' అన్నాడు.

'సరే. కానిమ్ము'

ఆటమధ్యలో కైలాసు ఎత్తువేసి హుషారుగా 'విశూ' అని పిలిచినాడు.

శంభుమిశ్రా పక్కనవ్వి, 'విశూ! ఇక్కడెక్కడ నున్నాడు.' అన్నాడు. ఇద్దరును నవ్వినారు.

శంభుమిశ్రా ఎత్తువేసి 'ఇదుగో బాబా! నీబంటులు రెండు పోవుచున్నవి!' అని హెచ్చరించినాడు.

కైలాసు గాబరాపడి 'రారానాయనా! చప్పునరా!' అని పిలిచినాడు. ఏదో మృదుల శరీరము వెనుకనుండివచ్చి తనవీపుపై పడునని కొంచెముసేపు ఎదురు చూచినాడు.. అతడట్లే ఉండుటచూచి మిశ్రా 'ఇక నీ బంట్లుదక్కవు! అన్నాడు. కైలాసు ఉలికిపడి 'అట్లయినచో రెండును పోయి నవా!'

ఆట అయిపోయినది. మిశ్రాకు గెల్చినను సంతోషము లేదు. 'బాబా! మీకీవేళ స్వస్థతగాలేదు. మీ మనస్సు మన స్సులోలేదు. మరొకనాడాడుకొందము లెండి' అని పిక్కల్ని సర్దివేసినాడు.

కైలాసు ఇంటికి చేరునప్పటికి మధ్యాహ్నమయినది. ఈనాడు విశ్వంలేడుగదా తొందరెందు కనుకొన్నాడు.

వంటింట్లోకి వెళ్ళిచూచినాడు. దాసి అంతయు సిద్ధము చేసినది. తానీనాడు మరల స్వయముగా వండుకొనవలెను. ఒక్కడే వడ్డించుకొని తినవలెను. తొందరచేయువారు లేరు. చేతిని లాగుటకు విశూలేడు. వంటింట్లోనికి వెళ్ళినాడు. ఒక్క పిడికెడుబియ్యము, రెండుమూడుబంగాళాదుంపలు,కొంచెము

పప్పు - అతనికన్నుల నీరు క్రమ్మినది. రెండేళ్ళ క్రితము సంగతి గుర్తువచ్చినది. అప్పుడిట్లే వండుకొనువాడు. దాసియే అన్నిటిని సిద్ధముచేసెడిది. అప్పుడీవిశూ రాను లేదు-పోను లేదు.

పనసచెట్టు క్రింద బొమ్మరిల్లు అట్లేయున్నది. అందులో మట్టిబొమ్మలు, పిల్లనగ్రోవి వగైరా అక్కడే పడియున్నవి. కైలాసు వాటినన్నిటిని తీసి తనపడకగదిలో జాగ్రత్త పెట్టినాడు.

మరల మధ్యాహ్నము వేళ గంగాపాండే యింటికి చద రంగమాడుటకై వెళ్లుచునేయున్నాడు. సాయంకాలమున ముకుందఘోషు ఇంటివద్ద జనము ప్రోగగుచున్నారు. కాని కైలాసుమాత్రము ఇదివరకటిలాగున ఆటలో నేర్పుచూప లేకపోతున్నాడు. గెలుపుకూడ తక్కువే ఇదివరకు తానాట నేర్పినవారే ఇప్పుడు తనకెత్తులు చెప్పుచున్నారు. ఎంత చచ్చు ఆటగాడైన నిప్పుడతని నోడింతునని ముందరికివచ్చి కూర్చుండు చున్నాడు.

కైలాసు కింకను ఆడవలెననియే యున్నది. కాని వెను కటి పటిమలేదు. అయినను ఒక్కొక్కసారి మంచియెత్తులే తోచుచున్నవి చదరంగములో తనకెదురులేదను కొను కైలాసుకి ఇప్పుడు సిగ్గుపడవలసి వచ్చుచున్నది. శంభుమిత్రా మాత్రమాయనను సగౌరవముగానే చూచుచున్నాడు.

ఇప్పుడు కైలాసు ఇంటివద్ద చాలబాధగా ఉన్నది. దాసీ కోపగించుకొనుట, కన్నీరు కార్చుట జరుగుచున్నది. 'బాబూ! మీరుబొత్తిగా తిండిమానినారు, ఒక్కసారి మీ ముఖమును అద్దములో చూచుకొనండి.' అనుచున్నది.

కైలాసు చిరునవ్వుతో 'వండుట - వార్చుట మరచి తినే. పొయ్యిదగ్గరే కూర్చుండలేకున్నాను.' అనును.

ఆదాసి చాలనాళ్ళనుండి యున్నది. అదిమాత్రము బలవంతముచేసి గుప్పెడు బియ్యము వండించేది.

ఇట్లొకనెల గడచినది. తర్వాత నాల్గురోజులు కైలాసు ఎవరికిని కన్పడలేదు. అందరికన్నా ముందుగా మిశ్రాకే ఆయన గుర్తులోకివచ్చినందున అతడు చూచుటకు వచ్చి నాడు. 'కైలాసుబాబూ!' అని బయటనుండియే కేకవేసినాడు.

'బాబుగారికి జ్వరమువచ్చినదండీ!' అని దాసిజవాబిచ్చినది.

మిశ్రాయింట్లోకివెళ్లి, కైలాసు ప్రక్కన కూర్చుండి 'బాబా! మీకు జ్వరమువచ్చినదా?' అని అడిగినాడు.

'మరేమిశ్రా! నాకాహ్వానము వచ్చినది. ఇకమెల్లగా వెళ్ళుచున్నాను.'

'రామరామ! అట్లనకండి. నాలుగైదు రోజులలో అదేతగ్గును.'

'ఇంకఇది తగ్గెడిదికాదు. ఈవయస్సులో ఏమితగ్గును? ఈసారి యికవెళ్ళవలసినదే.'

'వైద్యుని పిలిపించినారా?'

కైలాసు నవ్వుచు 'మిశ్రా! ఈఏబదెనిమిదేళ్ళ వయస్సులో వైద్యుడు వచ్చి మాత్రమేమిచేయగలడు?

'బాబా! ఇదొక పెద్ద వయస్సుకాదు. ఇంకొక యినాళ్లైనకూడ బ్రతుకవచ్చు.'

కైలాసు అందుకేమియు బదులుచెప్పక హఠాత్తుగా 'మావిశూ ఉత్తరము వ్రాసినాడుమిశ్రా! లచ్చీ!కిటికీ తెరువు. కొంచెము మిశ్రా కాఉత్తరము చదివి వినిపింతును.' అని ఓపిక తెచ్చుకొని తలగడక్రిందఉన్న ఉత్తరమునుతీసిఆమూలా గ్రము చదివి వినిపించినాడు. బెంగాలీలో ఉన్నదానిలోని విషయములు హిందీవాడైన మిశ్రాకి సరిగా తెలియలేదు.

మిశ్రా ఆరాత్రికి వైద్యుని తీసికొని వచ్చినాడు. వైద్యుడు బెంగాలీవాడు. కైలాసుని బాగా ఎరిగినవాడే. ఆయనవేసిన ప్రశ్నలకు జవాబులిచ్చినాక కైలాసు 'అయ్యా! నాబిడ్డ ఉత్తరమును వ్రాసినాడు. చదువుదును, వినండి!' అన్నాడు.

కైలాసు యొక్కబిడ్డ యెవరో వైద్యుడెరుగడు. అయి నను ఉత్తరమేదీ? అన్నాడు.

'నాబిడ్డ, విశూది, లచ్చీ! దీపమిట్లా తే.'

ఆదీపపువెల్తురులో మరల నాఉత్తరమును పూర్తిగా చదివి వినిపించినాడు. వైద్యుడు వినుచున్నాడా? లేదా? అన్నదిలేకుండ తనధోరణిలో తాను చదివినాడు. అదిసరయు విశ్వం పేరవ్రాసిన ఉత్తరము. కైలాసు కదెంతో ఆనందము నిచ్చేది. వైద్యుడు మందిచ్చి వెళ్లిపోయినాడు. మిశ్రాను పిల్చి కైలాసు తనవిశూ ఆకార వ్యవహారములను వర్ణించ సాగినాడు.

మరిరెండు వారాలుగడచినవి. కాని కైలాసుజ్వరము మాత్రము తగ్గలేదు. అప్పుడాయన ఇరుగు పొరుగున ఉన్న కుర్రవానిచే విశూకి కార్డు వ్రాయించినాడు. 'తాను

కులాసగానేఉన్నట్లు, కొంచెము సుస్తీగా ఉన్నను అంత విచారించవలసినపని లేదని దాని సారాంశము.

కైలాసుకిక జీవితాశలేదని తెలిసికొని హరిదయాల్ ఒక్కసారి చూచుటకయి వచ్చినాడు. కైలాసు రెండుమాటలు కాగానే తలగడ క్రిందనున్న జాబుతీసి హరిదయాలు చేతికిచ్చి 'దీనినిచదువు' అన్నాడు.

ఉత్తరముబాగా మకిలిపట్టినలిగియున్నది. ఒకటిరెండు చోట్ల చినిగినదికూడ. హరిదయాలెట్లో దానిని చదివినాడు. 'అవును ఇది సరయు వ్రాసినకార్డు' అన్నాడు.

'వ్రాతసరయుదేకాని ఉత్తరముమాత్రమునావిశూదే'

'అవును, క్రిందవానిపేరే ఉన్నది.'

ఆమాటతో కైలాసు తృప్తికల్గలేదు. 'వాని పేరే. వానిఉత్తరమే. సరయువ్రాసినదంతే. కొంచెము చదువుకొన్నాక నావిశూడే నాకు ఉత్తరములు వ్రాయును అన్నాడు.

హరిదయాలు తలనాడించినాడు.

కైలాసు మరింత ఉత్సాహముగా చెప్పసాగినాడు. 'బాబూ చదివినావా? నావిశూ 'రాత్రివేళ తాతా! తాతా! అని ఏడ్చునుకదా! నావిశూ నన్ను మరచునా?'

అట్లనుచుండగా అతనికన్నులనుండి కన్నీరు జలజల రాలినది. దాసి ప్రక్కనేనిలబడియున్నది. ఆమె హరిదయాల్‌కి సైగచేసి బయటికి రమ్మని 'పండాగారూ! తమరిక వెళ్ళండి. మీరిక్కడవున్నచో వారట్లు మాట్లాడుచునే యుందురు.' అని చెప్పి పంపినది.

ఇంకొక యైదురోజులు గడచినవి. పరిస్థితి మరింత పాడైనది. శంభుమిశ్రా రాత్రింబగళ్ళు కైలాసు ప్రక్కనే ఉంటున్నాడు. వైద్యుడప్పుడప్పుడు వచ్చి చూచిపోవు చున్నాడు. ఆనాడుపగలు స్పృహాయే లేదు చీకటిపడినాక కొంచెము తెలివివచ్చినది కాని మధ్యమధ్య తెలివితప్పుచునే యున్నది అర్ధరాత్రమున 'బాబూవిశ్వా! నామంత్రిని నాకిమ్ము నాయనా! లేనిచో నేను పందెమోడిపోదునురా.' అని పలవరించినాడు.

శంభుమిశ్రా దగ్గరకుచేరి 'ఏమి బాబాయ్! ఏమిటను చున్నారు? 'అన్నాడు. కైలాసు ఒక్కసారి మిశ్రాకేసిచూచి గాబరాపడి తలగడక్రింద చేయిపెట్టినాడు. ఏదో పోగొట్టు కొన్నదానికోసము వెదకుచున్నట్లున్నాడు. తరువాత వెదకినను దొరకనందున నిరాశుడై ప్రక్కకొత్తిగిలి 'బాబూవిశూ! ఇంకనైన ఆమంత్రినిమ్మురా నాయనా! అదిలేనిచో ఆటఎట్లా ఆడగలనురా బాబూ!' అని సణిగినాడు.

ఈ ప్రపంచచదరంగములో అతడుమంత్రిని పోగొట్టు కున్నాడు. ఆయన దీనముగా ఆమంత్రినిమ్మని విశ్వపతినే ప్రార్థించుచున్నట్లున్నాడు. మిశ్రా ఆయన దగ్గరకువచ్చి కూర్చున్నాడు. దాసి దీపము నాయన ముఖమునకు దగ్గరగా పెట్టిచూచినది. ఆయన కన్నులు పైకితిరిగినవి. కాని పెదవులు మాత్రమింకను కదలుచున్నవి 'విశ్వేశ్వరా! మంత్రిలేకుండ ఎన్నాళ్ళాడుదునురా నాయనా!' అని మెల్లగా వినపడినది. అతని ఆటకట్టు అయినది.

మర్నాడు హరిదయాల్ చంద్రనాథ్‌కి గడచినరాత్రి కైలాసు కైలాసము చేరినట్లు లేఖవ్రాసినాడు.